# ఆంధ్రకేసరి కథ

స్కూలులోను, వల్లమాలిన దుడుకు పనుల వల్ల ప్రకాశాన్ని డిస్మిస్ చేశారు. తండ్రి గోపాలకృష్ణయ్య డిప్యూటీ కలెక్టర్‌ని ఆశ్రయించి మళ్ళీ ఆ స్కూల్లో చేర్పించాడు. కొన్ని రోజులు గడిచాయి. ఒకరోజు సూర్యనారాయణ అనే పెద్దక్లాసులో ఒక అబ్బాయి ప్రకాశాన్ని రాళ్ళ నలుగురిలో అవమానించాడు-




ఆ రోజు ఇంగ్లీషు పుస్తకం చదువక పోయాడు ప్రకాశం. తిన్నగా సువర్ణముఖీ ఒడ్డుకి వెళ్ళి




మరునాడు క్లాసులో ఈ విషయం మాష్టరుకి ఫిర్యాదు చేశాడు సూర్యనారాయణ-




మళ్ళీ ప్రకాశాన్ని స్కూలు నుంచి డిస్మిస్ చేశారు. ఇంటి దగ్గర—




ప్రకాశాన్ని తీసుకుని గోపాలకృష్ణయ్య డిప్యూటీ కలెక్టరు దగ్గరకు వెళ్ళాడు.






# ఆంధ్ర ప్రదేశ్

సంపుటి : 17

జూలై, 1972
ఆషాఢ - శ్రావణ 1894

సంచిక : 9

ప్రధాన సంపాదకులు
**పెండ్యాల వామనరావు**

సంపాదకులు
కప్పగంతుల లక్ష్మణశాస్త్రి




రెండవ అట్ట : } ప్రకాశం జీవితచరిత్ర : బొమ్మల సీరియల్
మూడవ అట్ట : }

నాల్గవ అట్ట : శిల్ప విన్యాసం

సాలు చందా ఆరు రూపాయలు

**వెల : 50 పైసలు**

రిజిష్టరు నెం : 133

పేజీ

# చరిత్రకు దీపాలంకరణ

"లయతాళాన్వితమైన అడుగుల సవ్వడులతో సరసమాడుతూ
ఆశ్విక దళాల మధుర ధ్వనులు ఆవరించుకున్నాయి చార్మినారును"

అంటూ కొన్ని దశాబ్దాల క్రితం ప్రఖ్యాత భారత కవయిత్రి శ్రీమతి సరోజినీనాయుడు కవితాగానం చేసింది. చరిత్ర ప్రసిద్ధమైన చార్‌మినార్ వద్ద ఫ్లడ్‌లైట్ల ఏర్పాటును ఆమె గనుక వుంటే, హృదయపూర్వకంగా ఆహ్వానించి వుండేది. ఫ్లడ్‌లైట్ల కాంతులలో చార్మినార్ ప్రదర్శించే మనోహర దృశ్యాలు చూసి ఆమెలో మరొకసారి కవితావేశం కట్టలు త్రెంచుకుని ప్రవహించేదనడంలో సందేహంలేదు. టూరిజం అభివృద్ధికి దీక్షా కంకణం ధరించిన యూనియన్ టూరిజం, పౌర విమానయాన స్టేట్ మంత్రిణి డా॥ సరోజినీ మహిషి యీ మహోజ్వల చారిత్రిక నిర్మాణమైన చార్‌మినార్‌ను ధగద్ధగాయమానం చేసే యీ కార్యక్రమానికి జూలై 12వ తేదీన ప్రారంభోత్సవం చేసిన సంఘటన వర్తమాన చరిత్ర వేసిన ఒక ముందడుగు వంటిది.

అనేక శతాబ్దాలుగా చార్‌మినార్ — భాగ్యనగర నిర్మాత నవాబ్ కులీ కుతుబ్‌షా 1591లో నిర్మించిననాటి నుండి హైదరాబాదు నగరానికి ప్రాతినిధ్యం వహించే చారిత్రిక చిహ్నంగా ప్రఖ్యాతిగాంచింది. నేడు మనం సోషలిస్టు సమాజ యుగంలో ప్రవేశించి కృషిచేస్తున్నాం. ప్రజాభీష్టమే పరమ ప్రమాణమైన దశను చేరుకున్నాం. ఈ దృష్ట్యా చూసినప్పుడు, గతానికి సంబంధించిన మహోజ్వల నిర్మాణాలు గత కాలపు కళా వైదగ్ధ్యాన్నీ, వాస్తువిద్యా నైపుణ్యాన్నీ చేనోళ్ల చాటుతూ మన చరిత్రకు ప్రతినిధులుగా మన కండ్ల ఎదుట సాక్షాత్కరిస్తాయి.

ఈ బృహన్నిర్మాణం ఎందుకు కట్టబడిందో యిదమిత్థంగా తెలియదు. కాని నగరంలో వ్యాపించిన ఒకానొక మహావ్యాధినుండి నగరం విముక్తి పొందినందుకు గుర్తుగా చార్మినార్‌ను నిర్మించారని కొందరు అంటారు. దీని ప్రయోజనం కూడా దురూహ్యంగానే వుంది. నలువైపుల భవన పరివేష్టితమైన శృంగాటక సమీపంలో నిర్మించిన రాజప్రాసాదాలకు ముఖద్వారంగా యిది నిర్మించబడిందని భావించవచ్చు. 1687లో నగరం మొగలురాజుల ఆక్రమణలో వున్న సమయంలో చార్మినార్‌లోని ఒక గోపురం పిడుగు పాటుకు గురి అయింది. దీని పునర్నిర్మాణానికి 60 వేల రూపాయలు ఖర్చు అయింది. 1756లో ఫ్రెంచి సేనాని బుస్సీదొర సైన్యం దీనిని ఆక్రమించుకున్నది.

కొన్ని ముఖ్యసమయాలలో చార్మినారును నూనెదీపాలతో అలంకరిస్తూ వుండేవారని అంటారు. సర్ మీర్జా ఇస్మాయిల్ హైదరాబాదు ముఖ్యమంత్రిగా వున్న కాలంలో కొంత కాలం పాటు చార్‌మినార్‌ను విద్యుద్దీపాలతో అలంకరించారు. రిపబ్లిక్ దినోత్సవం వంటి ముఖ్య సమయాలలో యిప్పుడు కూడా చార్‌మినార్ మీద దీపాలంకరణ జరుగుతూనే వుంటుంది. కాని ఫ్లడ్‌లైట్ల నిర్మాణం మాత్రం నగరానికి క్రొత్తవిషయమనే చెప్పాలి.

ఈ ఫ్లడ్‌లైట్ల పథకానికి రూ. 1.23 లక్షలు ఖర్చవుతుందని అంచనా. దీన్ని పూర్తిగా భారత ప్రభుత్వమే భరిస్తున్నది. భారత దేశ యాత్రాపటంలో హైదరాబాదుకుగల ప్రాముఖ్యం నిర్వివాదాంశం. చార్మినార్ దీపాలంకరణ యాత్రికులకు మరొక క్రొత్త ఆకర్షణ. గోలుకొండలో 'సోనేలూమే' (కాంతి—శబ్దప్రసార కార్యక్రమం) పథకాన్ని చేపట్టవలసినదిగా భారతప్రభుత్వాన్ని రాష్ట్రప్రభుత్వం అర్థించింది. ఈ కార్యక్రమాన్ని అమలు పరచడానికి యిది చాలా అనుకూలమైన ప్రాంతమని యీ పథకం పరిశీలనకై ప్రత్యేకంగా కేంద్రం పంపిన పరిశీలక బృందం అధికార్లు అభిప్రాయపడ్డారు. ఈ పథకానికి రూ 10 లక్షలు ఖర్చవుతుందని అంచనా.

దీపాలంకరణ కార్యక్రమానికి అధ్యక్షత వహించిన ముఖ్యమంత్రి ఆ సందర్భంగా మాట్లాడుతూ, ఆంధ్రప్రదేశ్‌లో టూరిజం అభివృద్ధికి డా. మహిషి చూపిస్తున్న ఆసక్తిని ప్రశంసించి పేర్కొన్నారు. హైదరాబాదులో రూ 3.12 లక్షల వ్యయంతో ఒక యువజన హాస్టలు నిర్మాణం, రూ 6 లక్షల వ్యయంతో నెహ్రూ జూలాజికల్ పార్కులో సింహాలవిభాగం ఏర్పాటు [దీనికి డా. మహిషి శంకుస్థాపనకూడా చేశారు] రూ 6 లక్షల ఖర్చుతో మీర్ ఆలం చెరువుప్రాంతంలో పక్షుల రక్షిత ప్రాంతాన్ని ఏర్పాటు చేయడానికై స్థలసేకరణ, రూ 4 లక్షల ఖర్చుతో మంత్రాలయంవద్ద విశ్రాంతిగృహం నిర్మాణం రూ 5 లక్షల ఖర్చుతో వరంగల్లులో ఒక విశ్రాంతిగృహం నిర్మాణం హైదరాబాదులో మీర్ ఆలం చెరువువద్ద 1 లక్ష రూపాయల ఖర్చుతో ఒక విడిది స్థలం ఏర్పాటువంటి మొత్తం 25 లక్షల రూపాయలకుపైగా వ్యయమయ్యే పథకాలన్నిటినీ అతితక్కువ వ్యవధిలోనే భారతప్రభుత్వం మంజూరు చేసింది. విశాఖపట్నంజిల్లాలోని భీమునిపట్నంవద్ద మరో విడిదిస్థలాన్ని, ఒంగోలులో ఒక టూరిస్టుబంగ్లాను మంజూరు చేసే విషయాన్ని కేంద్రం చురుగ్గా పరిశీలిస్తున్నది. వీటన్నిటినిబట్టిచూస్తే టూరిజం మనరాష్ట్రంలో బాగా అభివృద్ధి చెందుతున్నదనీ మనం స్థిరంగా ముందుకు పురోగమిస్తున్నామనీ స్పష్టమవుతుంది.

-పి. వి. ఆర్

# వెనుకబడిన తరగతుల సంక్షేమం

మండలి వెంకట కృష్ణారావు

దేశంలోని పరిపాలకులకు ఈ దశాబ్దం చాల గడ్డుసమస్యలతో కూడివుంది. వెనుకబడిన తరగతులకు చెందిన శ్రేయస్సును పెంపొందించడానికి వారు కృత నిశ్చయులై వున్నారు. ఇది అంత సులభమైన పనికాదు. సమాజంలోని బలహీనవర్గాల ఆర్థిక, సాంఘిక, రాజకీయ పరిస్థితులను అభివృద్ధిపరచగలమని నాయకులు ఎన్నికల సమయంలో ప్రజలకు వాగ్దానాలు చేశారు. ఈ వాగ్దానాల ఫలితంగానే వారు అత్యధిక మెజారిటీతో అధికారంలోకి రాగలిగారు. అధికారంలోకి వచ్చిన తరువాత, సమాజంలోని బలహీన వర్గాల ప్రజల శ్రేయస్సును గురించి, వారికి కొత్త ఆశలు రేకెత్తించిన తరువాత, ఈ లక్ష్యాన్ని సాధించడం కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల ప్రథమ కర్తవ్యంకావడం సమంజసమే. వెనుకబడిన తరగతుల బలహీన వర్గాల ప్రజల జీవన ప్రమాణాలను మెరుగుపరచడం త్వరగా జరిగే పనికాదు. అయితే సాంఘిక, ఆర్థిక, రాజకీయ రంగాలలో ఈ వర్గం ప్రజల అభ్యున్నతికై కార్యదీక్షకు పూనుకోవడం చాల అవసరం.

దేశంలో అనేక వర్గాలు సాంఘికంగా, ఆర్థికంగా, రాజకీయంగా కూడా చాలా వెనుకబడివున్నందున వారి యోగక్షేమాలను దృష్టిలో పెట్టుకొని మన రాజ్యాంగంలో కొన్ని ప్రత్యేకమైన ఆదేశాలు పేర్కొనడం జరిగింది. ఈ ప్రజలకు, ముఖ్యంగా షెడ్యూలు తరగతులు, షెడ్యూలు కులాల ప్రజలకు సాంఘికంగా అన్యాయం జరగకుండా, వారికి తగిన రక్షణ కల్పించే ఉద్దేశంతో మన రాజ్యాంగంలో 46వ సూత్రంలో రాష్ట్ర ప్రభుత్వ లక్ష్యాలు నిర్దిష్టంగా పేర్కొనబడివున్నాయి. రాజ్యాంగంలోని 15 (4)వ సూత్రం ప్రకారం ఈ తరగతి ప్రజల అభ్యున్నతికి ప్రత్యేక చర్యలు తీసుకోవడానికి ప్రభుత్వానికి ప్రత్యేక అధికారాలున్నాయి. 16 (4) సూత్రం ప్రకారం ప్రభుత్వం ఈ తరగతుల ప్రజలకొరకు ఉద్యోగాలలో రిజర్వేషను కూడా చేయవచ్చు.

రాజ్యాంగరీత్యా వెనుకబడిన తరగతులవారికి కల్పించవలసిన సౌకర్యాలు సమకూర్చబడినాయి. ఎన్నికల వాగ్దానాలను ప్రభుత్వం నిలబెట్టుకోవలసివుంది. శ్రేష్ఠతర జీవితం కొరకు, ఈ ప్రజలు చిరకాలంగా అనేక ఆశలు కల్పించుకొనివున్నారు. ఆశయాలు కలిగివున్నారు. అంతేకాక వారి ఆర్థిక పరిస్థితినిబట్టి వారి సంక్షేమానికి కృషిచేయడం ప్రభుత్వ కర్తవ్యమైవుంది. పేదరికమనేది ఒక అంటువ్యాధి వంటిది. ఇది ప్రబలంగా వ్యాపిస్తే విపరీతమైన దుష్ఫలితాలు కలుగుతాయి. సమాజంలో ఒక వర్గంలో పేదరికం వుంటే, అది ఇతర వర్గాలకు కూడా వ్యాపిస్తుంది. ఈ ప్రకారం జాతి మొత్తాన్ని ఆవరిస్తుంది. కాలం జరిగేకొద్ది సమాజంలో శ్రీమంతులైనవారు కూడా బాధపడవలసివస్తుంది. బాగా అభివృద్ధి చెందిన దేశానికి కూడా ఇది వర్తిస్తుంది. అందుకనే కలిగిన దేశాలు వెనుకబడిన దేశాలకు, తక్కువ అభివృద్ధి చెందిన దేశాలకు సహాయం చేస్తున్నాయి. ఒక విధంగా ఇది ప్రాజ్ఞతతోకూడిన స్వార్థం.

రాజ్యాంగపు ఆదేశాల ఫలితంగా, ఎన్నికల వాగ్దానాల ఫలితంగా, న్యాయంకొరకు దళిత ప్రజలలో ఏర్పడుతున్న అశాంతి ఫలితంగా, పేదరికం ఇతర వర్గాలకు కూడా వ్యాపించే ప్రమాదం వున్న ఫలితంగా వెనుకబడిన తరగతుల, బలహీన వర్గాల సమస్యలను పరిష్కరించడం తక్షణ కర్తవ్యమైవుంది.

అయితే, భారత దేశ సమాజవ్యవస్థలో వున్న అనేక తారతమ్యాల ఫలితంగా సమస్యలను వెంటనే పరిష్కరించడం అంత సులభం కాదు. ఇందులో ఎన్నో చిక్కులున్నాయి. అవి దిగువ ప్రస్తావించబడినాయి.

మొదటి సమస్య ఏమిటంటే, వెనుకబడిన తరగతులు, బలహీనవర్గాలు ఏవి అని నిర్ణయించడం. ఒక వర్గాన్ని, వెనుకబడిన వర్గం అంటే, దాని అర్థం ఏమిటి? వారు సాంఘికంగా వెనుకబడివున్నారా? లేక రాజకీయంగానా? వెనుకబడిన తరగతి అని ఏ సూత్రాన్ని ఆధారం చేసుకొని నిర్వచన చేయాలి? ఇక, రెండవ సమస్య ఏమంటే, ఆర్థిక సాంఘిక, రాజకీయాభివృద్ధి కొరకు కార్యక్రమాలు రూపొందించడం. ఇందులో కూడా చిక్కులు లేకపోలేదు. వివిధ కార్యక్రమాలను రూపొందించేందుకు వాటిని అమలు చేయవలసిన తీరుతెన్నులను కూడా నిర్ణయించవలసివుంటుంది. ప్రస్తుత వ్యవస్థలో అసమానత్వానికి స్థానంలేకుండా చేస్తూ, ఆర్థికవ్యవస్థలో ఒడుదుడుకులు లేకుండా సమంజసమైన కాలంలో మన లక్ష్యం సాధించడానికి మనం కృషిచేయాలి. దీనిభావమేమిటంటే చేపట్టిన కార్యక్రమాలు శీఘ్రగమనంతో అభివృద్ధికి దోహదం చేయాలి. ఈ అభివృద్ధికి ఫలితాలు అవి ఉద్దేశించబడిన ప్రజల అనుభవంలోకి రావాలి. వారిలో ఏర్పడిన అశాంతి తొలగిపోవాలి. భవిష్యత్తును గురించి వారిలో ఆశాకిరణం ఉదయించాలి. ఈ కార్యక్రమాలను సక్రమంగా, సమర్థవంతంగా అమలు పరుచడానికి ఆర్థిక వనరులు సమకూర్చడం అవసరం. మనల్ని ఎదుర్కొంటున్న మూడో సమస్య ఇది. వెనుకబడిన తరగతులు, బలహీనవర్గాల శ్రేయస్సుకై రూపొందించిన కార్యక్రమాలు అభివృద్ధి ప్రణాళికలను అనుసరించి వుంటాయి. అయితే నిధులకొరత కారణంగా ఈ పథకాలు అడుగున పడిపోయే ప్రమాదం వుంది. అంగీకరించబడిన ఈ కార్యక్రమాల అమలుకు విధానాన్ని రూపొందించడం నాల్గవ సమస్య. ప్రస్తుత పరిస్థితులలో కార్యక్రమాలను సమర్థ

వంతంగా అమలు జరుపడానికి నిర్దిష్ట విధానాన్ని అనుసరించడం అవసరం. అంతేకాకుండా పరిపాలనా యంత్రాంగం, ఈ కార్య క్రమాలను అమలు జరుపడానికి కార్యాచరణ వ్యవస్థను ఏర్పాటు చేయాలి. వాటిని అమలు జరిపించి, కార్యక్రమాలవల్ల కలిగిన ఫలితాల ప్రభావాలను సరిగా తెలుసుకొని అవసరమైనప్పుడు కార్య క్రమాల అమలు తీరుతెన్నులలో మార్పులు సూచించాలి. అప్పుడు అన్ని విషయాలలో సమన్వయం ఏర్పడుతుంది. ఇది సర్వతో ముఖాభివృద్ధికి దోహదం చేస్తుంది.

వెనుకబడిన తరగతుల, బలహీనవర్గాల సంక్షేమానికి సంబంధించిన ప్రధాన సమస్యలు దిగువవిధంగా ఉన్నాయని భావించ బడుతున్నది.

1. వెనుకబడిన తరగతుల నిర్వచనం
2. తగిన సంక్షేమ పథకాలను రూపొందించడం.
3. వనరులు.
4. విధాన అంశాలు.
3. పరిపాలనా సంబంధమైన సమస్యలు.

బలహీనవర్గాల వారు ఎవరు అనేసమస్య ఎప్పుడూ క్లిష్టం గానే ఎదురవుతున్నది. ఈ ముఖ్యమైన సమస్యపై అనేక మంది అనేకవిధాలుగా నిర్వచించారు. కోర్టులు తమ తీర్పులను ప్రక టించాయి. ఈ తరగతుల ప్రజల నిమిత్తం ప్రత్యేకంగా వ్యవహ రించాలని మన రాజ్యాంగం నిర్దేశించినప్పటికీ, వెనుకబడిన తరగతుల నిర్వచనం, వారి సంక్షేమానికి తగిన కార్యక్రమాల అమలు ఆచరణ రీత్యా క్లిష్టంగా తయారైంది. వెనుకబడిన తనానికి కులం ప్రాతి పదిక కారాదని కొందరి వాదనగా ఉండగా, మరికొందరు ఆ ప్రాతి పదికను బలపరుస్తున్నారు. ప్రస్తుతపు సమాజ జీవితంలో కులం ప్రత్యేకమైన పాత్ర వహిస్తున్నపుడు – దానిని కాదనే వీలులేదు. ఆంధ్రప్రదేశ్ సాంఘికంగాను, విద్యావిషయకంగాను వెనుకబడిన వర్గాలను గుర్తించడం జరిగింది. వెనుక బడిన తనం గుర్తింపుకు కులం ఏకైక ప్రాతిపదిక కాకపోయినప్పటికీ సాంఘికంగా వెనుక బడినవారిని గుర్తించవచ్చుననే సుప్రీముకోర్టు అభిప్రాయాన్ని దృష్టిలో ఉంచుకుని వెనుక బడిన తరగతుల కమీషన్ తమ నివేదికను సమర్పించింది. సాంఘికంగాను, విద్యావిషయకంగాను వెనుకబడిన వర్గాల 92 కులాలను నివేదికలో సూచించారు. వారిలో 37 కులాలు ఆదిమ జాతులకు చెందినవారు, విముక్తజాతులు, సంచారకజాతులు, సంచారక గిరిజనులు ఉన్నారు. వృత్తి బృందాలు, హరిజనులుగా మారినవారు 21 కులాలు. ఇతర వెనుక బడిన వారు 33 కులాలకు చెందినవారు ఉన్నారు. ఈ వర్గాలకు చెందినవారి సంఖ్య ఎంత అనేది నిర్దిష్టంగా తెలియదు. అయితే మనరాష్ట్రంలోని జనాభాలో 38 శాతం–అంటే కోటిన్నర మంది సాంఘికంగాను, విద్యావిషయకంగాను వెనుకబడిన వర్గాల ప్రజలు ఉన్నారని అంచనా వేయబడింది. వారికితోడు 14 శాతం ఉన్న షెడ్యూలు కులాలవారిని కలిపినప్పుడు ప్రభుత్వంముందువున్న యీ సమస్య ఎంత జటిలమైనదో ద్యోతకమవుతుంది. ముందే వెనుక బడివున్న యీ రాష్ట్రంలోని జనాభాలో సగానికి సగం వెనుకబడిన వర్గాల వారైనప్పుడు, వారినిమిత్తం ప్రత్యేక శ్రద్ధ వహించడ మనేది మరింత క్లిష్టసమస్య అయినప్పటికీ, సాంఘికంగాను విద్యా విషయకంగాను ప్రత్యేక శ్రద్ధ వహించాల్సిన వర్గాలు ఉన్నాయనే విషయాన్ని ప్రభుత్వం గుర్తించింది.

వెనుకబడిన వర్గాలు ఏవి అనే విషయాన్ని నిర్దేశించిన ప్రభుత్వం, వారి సంక్షేమం నిమిత్తం కొన్ని ప్రత్యేక కార్య క్రమాలను అమలు జరుపుతున్నది. కొన్ని దశాబ్దాలుగా అమలు జరుపబడుతూనే ఉన్న కార్యక్రమాలు సరిపోతాయని గానీ, సరి అయిన విధంగా అమలు జరుపబడుతున్నా యనిగానీ, చెప్పలేము. వెనుకబడిన తరగతుల కమీషను యీ పై కార్యక్రమాలను కొత్త దృక్పథంతో గమనించి, ఈ తరగతుల ప్రజల సంక్షేమానికి మరికొన్ని కార్యక్రమాలను సూచించింది. ప్రజల జీవన ప్రమాణాన్ని పెంపొందించడానికి వరుసగా పంచవర్ష ప్రణా ళికలను అమలు జరుపుతూ అభివృద్ధి కార్యక్రమాలను చేపట్టిన దృష్ట్యా, వాటి ఫలితాలను యితర ప్రజలతోపాటు వెనుకబడిన వర్గాల ప్రజలు కూడ అనుభవిస్తున్నారని పేర్కొనవచ్చు. ఈ ప్రణాళికల ద్వారా వారికి కూడా ప్రయోజనాలు సిద్ధిస్తున్నాయనే విషయాన్ని వారు గుర్తించేవిధంగా చేయాల్సిఉంది. ఉదాహరణకు విద్యారంగాన్ని అభివృద్ధిపరచడానికి ప్రణాళికలలో అనేకపథకాలను రూపొందించి అమలుజరిపారు. వెనుక బడిన తరగతులకు చెందిన వారు వినియోగించుకునేందుకు వీలుగా ప్రత్యేక కార్యక్రమాలను అమలుజరిపారు. అదేవిధంగా వ్యవసాయరంగంలో కూడ జరిగింది. సస్యవిప్లవం ద్వారా లభించిన ఫలితాలను వారు కూడా అనుభవించే విధంగా చేయడం జరిగింది. రోగాలను తగ్గించి, తగిన ఆరోగ్య కరమైన జీవన పరిస్థితులను కల్పించడానికి ఆరోగ్య, పారిశుద్ధ్య పథకాలను అమలు జరిపారు. పంచవర్ష ప్రణాళికలలో ప్రతి అభివృద్ధిరంగంలో యితర సంక్షేమ కార్యక్రమాలతోపాటు అదనంగా వెనుకబడిన వర్గాలవారి నిమిత్తం ప్రత్యేక పథకాలను అమలు జరిపారు. ఈ వర్గాల వారి సంక్షేమానికి అమలు జరిపిన కార్యక్రమాల వివరాలు దిగువ ఇవ్వబడినాయి.

## విద్యా సౌకర్యాలు

రాష్ట్రంలో ఆర్థికంగా వెనుకబడి ఉన్న యీ వర్గాల ప్రజలు విద్యా సౌకర్యాలను వినియోగించుకోలేని స్థితిలో ఉన్న కారణంగా రెసిడెన్షియల్, నాన్ రెసిడెన్షియల్ వంటి స్కాలర్ షిప్పులు, ఫీజులు మినహాయింపు, హాస్టల్ సౌకర్యాలతో పాటు వృత్తి విద్యాసంస్థలలో సీట్ల రిజర్వేషన్ వంటి ప్రత్యేక ప్రోత్సాహక పథకాలను అమలు జరుపుతున్నారు. 1971–72 సంవత్సరంలో ఆర్థికంగా వెనుకబడిన తరగతుల వారికి రు. 46 98 లక్షల ఖర్చుతో 20,763 పోస్ట్‌మెట్రిక్ స్కాలర్‌షిప్పులు యివ్వ డిబనాయి. నమోదుఅయిన వెనుకబడిన తలగతులవారికి రు. 14.63 లక్షల ఖర్చుతో 9,680 స్కాలర్‌షిప్పులు యివ్వబడినాయి. ప్రిమెట్రిక్ నాన్ రెసిడెన్షియల్ స్కాలర్‌షిప్పులను మంజూరు చేయడానికి రు. 10 లక్షలు జిల్లా కలెక్టర్లకు యిచ్చారు. మన రాష్ట్రంలో కళాశాలలలో చదువుతున్న హరిజన క్రైస్తవులు, ఆర్థి

రంగా వెనుకబడిన తరగతుల వారికి ఫీజు రాయితీలు యివ్వబడినాయి. ఫీజు రాయితీలద్వారా నష్టపోయిన మొత్తాల మేరకు పరిహారంగా విశ్వవిద్యాలయాలకు 1971_72 సంవత్సరంలో రు.3 లక్షలు కేటాయించడం జరిగింది. వాటికి తోడు, వెనుకబడిన తరుగతులవారి నిమిత్తం 3364 మంది అభ్యర్థులతో 68 ప్రభుత్వ హాస్టళ్లను ప్రభుత్వం నిర్వహిస్తున్నది. 1971_72లో యీ హాస్టళ్ల నిర్వహణ నిమిత్తం జిల్లా పరిషత్తులకు రు. 11.10 లక్షలు మంజూరు చేశారు. ప్రభుత్వ హాస్టళ్ళకు తోడు 123 బాలుర సబ్సిడీ హాస్టళ్ళు, 30 బాలికల సబ్సిడీ హాస్టళ్ళు ఉన్నాయి. వాటిలో వరసగా 5052 మంది బాలురు, 771 బాలికలు ఉన్నారు. 1971_72 సంవత్సరంలో ఈ హాస్టళ్ళకు బోర్డింగు గ్రాంట్లు మంజూరు చేయడానికి వీలుగా జిల్లా పరిషత్తులకు రు. 6.19 లక్షలను ప్రభుత్వం కేటాయించింది. ప్రభుత్వ హాస్టళ్ళలోను, సబ్సిడీ పొందిన హాస్టళ్ళలోను ఉన్న విద్యార్థులకు పౌష్టిక ఆహారం లభింపజేసే నిమిత్తం 'కేర్' ఆహారం యివ్వబడుతున్నది. రవాణా, నిర్వహణ ఖర్చుల నిమిత్తం 1971_72లో రు. 2 లక్షలు కేటాయించారు.

## నివేశన స్థలాలు

నివేశనస్థలాలు కేటాయించడం ద్వారా వారిజీవన పరిస్థితులను మెరుగు పరచడానికి ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది. మెట్ట ప్రాంతాలలో కుటుంబానికి 5 సెంట్ల చొప్పున, మాగాణి ప్రాంతాలలో కుంటుబానికి 3 సెంట్ల చొప్పున యీ తరగతుల వారికి నివేశన స్థలాలను ఉచితంగా పంపిణీచేశారు. ఈ తరగతుల ప్రజలకు నివేశన స్థలాలకు కేటాయించడానికి 1971_72 సంవత్సరంలో ఒక ప్రత్యేక కార్యక్రమాన్ని అమలు జరిపారు. సేకరించిన ప్రైవేటు భూములకు పరిహారం చెల్లించే విధానాలను సులభం చేయడమేగాక ప్రత్యేక సిబ్బందిని కూడా ఏర్పాటు చేశారు.

ఈ తరగతుల ప్రజల ఆర్థిక అభ్యున్నతి నిమిత్తం పాడి క్షేత్రాల వంటి అనుబంధ వృత్తులను చేపట్టడానికి ప్రోత్సహించడం జరుగుతున్నది. పాడిపశువుల సరఫరా నిమిత్తం కుటుంబానికి రు. 1000 చొప్పున రు. 2 లక్షలు మంజూరు చేశారు.

వారి విద్యాభివృద్ధిలో ప్రోత్సాహక పథకాలను అమలు జరపడంతో పాటు రాష్ట్ర ప్రభుత్వ సర్వీసులో తగిన ప్రాతినిధ్యం కల్పించడానికి ఉద్యోగాలలో 5 శాతం సీట్లను వారికి రిజర్వు చేశారు. ఈ విధంగా వారికి ఉపాధి సౌకర్యం కల్పించడం జరిగింది. షెడ్యూలు కులాలకు చెందిన అభ్యర్థులకు గరిష్ఠ వయఃపరిమితిని 5 సంవత్సరాలు మినహాయింపు యివ్వబడింది. వృత్తి కళాశాలలలో 25 శాతం సీట్లను వారికొరకు రిజర్వు చేశారు.

వారి జనాభా దృష్ట్యా గతంలో జరిగినదంతా సరిపోదని భావించబడుతున్నది. దానికి కారణం ఆర్థిక వనరుల కొరత అని చెప్పవచ్చు. కేంద్ర ప్రభుత్వం యిచ్చే సహాయంతో సహా ఆర్థిక వనరులు చాలా తక్కువగా వున్నాయి. మనరాష్ట్రంలో అన్ని రంగాలలో అభివృద్ధికి తగిన వనరులు లేనప్పుడు యీ వర్గాల ప్రజల సంక్షేమానికి సంబంధించిన పథకాలకు అధనంగా ఎక్కువ కేటాయించటం కష్టసాధ్యమైన విషయం. దీనిని సాకుగా చెప్పడానికి వీలులేనప్పటికి, మన వనరులు మన కార్యక్రమాల అమలును పరిమితం చేస్తున్నాయి. అయినప్పటికీ యీనాటి పరిస్థితులకు అనుగుణంగా వనరులను సమీకరించడానికి ప్రభుత్వం నిరంతరం కృషిచేస్తూనే ఉన్నది. అవసరమైతే యీ వర్గాల ప్రజలకు తగినవాటా లభించే విధంగా అభివృద్ధివేగం తగ్గించడం మరో ప్రత్యామ్నాయ మార్గం కాక్కూడదని నేను భావిస్తున్నాను. ఈ వర్గాల ప్రజల సంక్షేమానికి సంబంధించిన పథకాలకు ఎక్కువ ప్రాముఖ్యం యిచ్చినప్పుడు నీటిపారుదల, విద్యుచ్ఛక్తి మొదలైనటువంటి యితర అభివృద్ధి రంగాలకు కేటాయించే మొత్తాలు తగ్గిపోతాయి. అదనపు వనరులను సేకరించలేనప్పుడు మరో మార్గం నాకు కనిపించడంలేదు. ప్రజలు యీనాడు అభివృద్ధి వేగానికన్నా సాంఘిక న్యాయానికి ఎక్కువ ప్రాధాన్యత నిస్తున్నారు. అభివృద్ధివేగం పెంపుదలను అందరూ హర్షిస్తారనడంలో సందేహంలేదు. అయితే ఫలితాలలో యీ వర్గాల ప్రజలకు కూడా తగిన వాటా లభించాలి. ఈ వర్గాలతో ప్రమేయం లేకుండా అభివృద్ధిని యిలాగే కొనసాగించినపక్షంలో అంతిమంగా యీ ప్రజలలో రాజకీయంగాను, ఆర్థికంగాను అశాంతి పరిస్థితి ఏర్పడి_అభివృద్ధి గమనమే ఆగిపోయే ప్రమాదం ఏర్పడవచ్చు. ఈనాడు సాంఘిక న్యాయం చేకూర్చే అభివృద్ధి చాలా అవసరం. అభివృద్ధి ఫలితాలలో తగినవాటా వారికికూడా లభించినప్పుడు ప్రజలు నెమ్మదిగా పురోభివృద్ధిని సాధించడానికి సిద్ధంగా ఉన్నారు.

ఈ దృష్టితోనే రాష్ట్ర విధానాన్నంతటినీ తిరిగి పరిశీలించుకోవాల్సి ఉంది. కేవలం ఆర్థికాభివృద్ధి పెరుగుదల ప్రాతిపదికపై అభివృద్ధినిమిత్తం వనరులను కేటాయించే రాష్ట్ర విధానం యిప్పుడు మారిపోయింది. అభివృద్ధిగమనానికి ప్రాధాన్యం కలిగినప్పటికీ యీ వర్గాల ప్రజల సంక్షేమానికి ఎక్కువ నిధులను కేటాయించడం యీనాడు చాల అవసరం. ఆర్థిక వనరుల కేటాయింపులోనేగాక సాంఘిక విధానాలలో కూడా ప్రభుత్వం ప్రగతిశీలతతో ఉండాలి. అదృష్టవశాత్తు మన రాష్ట్రంలో భూసంస్కరణలను త్వరితగతిని అమలు జరుపాలని నిర్ణయించుకున్నాము. సమసమాజ నిర్మాణ గమనంలో యిది సరియైన ముందడుగని చెప్పవచ్చు. దేశ పునర్నిర్మాణంలో వారు పాల్గొనే విధంగా చేసే మన విధానాలుకూడా సరైనవనే చెప్పవచ్చు. పట్టణ ఆస్తులపై పరిమితి విధించడంతో యీ వర్గాల ప్రజలలో మరింత విశ్వాసం ఏర్పడుతున్నది.

ఈ వర్గాల ప్రజలకు వారికి తగిన వాటా లభింపజేయడానికి ప్రభుత్వం చిత్తశుద్ధితో కృషిచేస్తున్న విషయం యిటీవల శాసనసభకు అభ్యర్థుల ఎంపిక, ప్రభుత్వం ఏర్పాటు విధానంద్వారా ప్రజలకు వెల్లడి అవుతున్నది. ప్రస్తుతపు ముఖ్యమంత్రి నాయకత్వంలో యీ వర్గాల ప్రజల భవిష్యత్తు భద్రంగా ఉంటుందని నేను భావిస్తున్నాను. ఇది అందరూ కలిసి కట్టుగా చేయాల్సిన కృషి. దీనికి మనందరమూ కట్టుబడి ఉన్నాము. మన కృషి అంతా యీ వర్గాల ప్రజలు యిచ్చే సహకారంపై ఆధారపడి ఉంటుంది.

ముగించేముందు ఈ తరగతుల సంక్షేమం విషయంలోగల పరిపాలనా విషయాలనుగురించి ప్రస్తావిస్తాను. పాతకాలపు పరిపాలనా పద్ధతిలో నూతన విధానాన్ని విజయవంతంగా అమలు జరపడం సాధ్యంకాని విషయం. మనముందు వున్న లక్ష్యాన్ని సాధించడానికి ఉపయుక్తమయ్యేవిధంగా పరిపాలనా వ్యవస్థను తీర్చిదిద్దడానికి నేను కృషిచేస్తాను. వినూత్న పరిస్థితిని ఎదుర్కొనడానికి అందుకు అనుకూలమైన ఆర్గనైజేషను వుండాలి. ఇది చేయకుండా వున్నట్లయితే, మనం చేసే ప్రయత్నాలు నిష్ప్రయోజనమవుతాయి. ప్రభుత్వం ఈ విషయాన్నికూడా పరిశీలిస్తున్నది.

1972 ఏప్రిల్ 9, 10 తేదీలనాడు జరిగిన సాంఘిక సంక్షేమ సదస్సులో ఈ విషయాలు చర్చించబడినాయి. ప్రభుత్వం ముందర ఇప్పుడు ఆచరణ యోగ్యమైన సిఫార్సులు వున్నాయి. వాటిని అమలు పరచడానికి తగిన నిర్ణయాలు చేయబడుతాయి. ఏది ఎట్లావున్నా, ఈ సమస్యల అంతిమ పరిష్కారం ఈ ప్రజల చేతుల్లోనే వున్నదని నేను విశ్వసిస్తున్నాను. కృతనిశ్చయమైవున్న ప్రభుత్వం, కార్యదీక్షా తత్పరులైన ప్రభుత్వోద్యోగులు, పురోగామినాయకులు, ఇతరులు ఈ వర్గాల ప్రజలకు చేయూతనివ్వవచ్చు. అయితే ఈ ప్రజలు చొరవ తీసుకొని ముందుకు వచ్చి ఇతరులతోపాటు ప్రగతి పథంలో నడవాలంటే, వారిలో ఆ సంకల్పదీక్ష వుండడం అవసరం. వారిలోకూడా ఇప్పుడు మార్పులు రావాలి. ఫిర్యాదులు చేసే పద్ధతిలో వారు వుండరాదు. తమకు రావలసినదానిని డిమాండుచేసేహక్కు వారికి వుంది. అయితే వారు నిర్వహించవలసిన విధులుకూడా వున్నాయి.

ఈ విషయాన్ని వారు ఎంతత్వరగా గుర్తిస్తే వారికి అంత క్షేమకరం. వారి ప్రయోజనాలను పరిరక్షించడానికి కృషిచేస్తున్న వివిధ సంస్థలు ఈ విషయాన్ని ఆ ప్రజలకు తెలియజేయాలి; నచ్చచెప్పాలి. రిజర్వేషనులు, రాయితీలు, ప్రత్యేక సదుపాయాలు ఇవన్నీ మంచివే. అయితే అవి కొంతకాలం వరకు మాత్రమే మంచివి. దేశపరిపాలనా వ్యవహారాలలో ఇవి శాశ్వతమైన సౌకర్యాలు కాజాలవు. ఈ సౌకర్యాలు అమలులో వున్న కాలంలో ఈ వర్గాల ప్రజలు తమ పరిస్థితిని చక్కదిద్దుకొని, తమ కాళ్లపై తాము నిలబడగలగాలి. ఆ తరువాత ఈ రాయితీల అవసరం వుండదు. ఈ వర్గం ప్రజలు ఈ విషయాన్ని గుర్తిస్తారని నేను విశ్వసిస్తున్నాను. ఎందుకంటే, తాను వెనుకబడిన వాడిననీ, సమాజంలో వెనుకబడిన వర్గానికి చెందిన వాడిననీ చెప్పుకోవడానికి ఎవ్వరికీ ఇష్టం వుండదు. మన ప్రభుత్వం ఈ తరగతులవారికి సాంఘిక న్యాయం చేకూర్చగలదని, అనతి కాలంలోనే ప్రతిరంగంలోనూ ఈ వర్గం ప్రజలు తమ హక్కులు బాధ్యతలు నిర్వహించగలరనే ప్రగాఢవిశ్వాసం నాకుంది.



# 1972-73

# రాష్ట్ర బడ్జెట్

**ఆంధ్రప్రదేశ్ శాసనసభలో, శాసనమండలిలో 1972-73 సంవత్సరపు బడ్జెటును సమర్పిస్తూ, 1972 జూన్ 23వ తేదీన ఆర్థికమంత్రి శ్రీ అనగాని భగవంతరావుగారు యిలా అన్నారు:**

"1970-71, 1971-1972 ఆర్థిక ఫలితాలు తాత్కాలిక బడ్జెటులో సూచింపబడినవి కాబట్టి, ఈ విషయం గురించి నేను ప్రస్తావించటం లేదు ఈ ఏడాది ఆర్థిక వ్యవహారాల గురించి మాత్రమే క్లుప్తంగా వివరిస్తాను

ఓట్ ఆన్ అక్కౌంట్ బడ్జెట్ సమయంలో అనుకొన్న రూ 344.70 కోట్ల స్థానే, రెవిన్యూఖాతా కింద జమల మొత్తం రూ. 354 66 కోట్లు అని సూచింపబడింది ఈ పెరుగుదలకు కారణాలు—ఆదాయపు పన్నులు, కేంద్ర ప్రభుత్వం నుంచి సహాయపు గ్రాంట్లు, (ముఖ్యంగా మురుగు సెస్సు క్రింద) భూమిశిస్తు క్రింద ఎక్కువ వసూళ్ళు. ఓట్ ఆన్ అక్కౌంట్ బడ్జెట్‌లో అనుకొన్న రివిన్యూ ఖాతాన ఖర్చు రూ. 331 76 కోట్లు ఇప్పుడీ మొత్తం రూ 341.85 కోట్లు. ఈ పెరుగుదలకు ముఖ్యకారణాలు.

| | | రూ. లక్షలు |
|---|---|---|
| (1) | పోలీసు సిబ్బందిని నవీనం చేసే పథకం | ... 65 |
| (2) | గ్రామీణ ఉద్యోగావకాశాలకు తీవ్ర పథకం | ... 321 |
| (3) | పోచంపాడు ఆయకట్టు ప్రాంతంలో వ్యాపార నిర్మాణం | ... 73 |
| (4) | క్షామ బాధితులకు సహాయం | ... 616 |

ప్రణాళికను తగ్గించవలసిన అవసరం దృష్ట్యా, నీటిసాగు, విద్యుచ్ఛక్తి రంగాల కేటాయింపుల్లో సుమారు 9 కోట్లు తగ్గించ బడినది మామూలు ప్రణాళికలో నాగార్జునసాగర్ ప్రాజెక్టుకు, పోచంపాడుకు వరుసగా రూ. 7 కోట్లు, 6 కోట్లు కేటాయించ బడినవి. ఇదికాక, పోచంపాడు ప్రాజెక్టుకు రూ. 4 కోట్లు కేటాయించబడినది—అంటే, ఖర్చుకాని తెలంగాణా మిగులునుంచి రూ. 2 కోట్లు; కేంద్ర ప్రణాళికేతరసహాయం నుంచి 2 కోట్లు. హక్కుల రికార్డులతయారీకై కేటాయించిన రూ. 75 లక్షలతో సహా వ్యవసాయకార్యక్రమాలపై వ్యయంలో కొద్దిపాటి పెరుగుదల ఉంది. సాంఘిక వసతులక్రింద, ప్రణాళిక కేటాయింపు 1971–72 లోని 1,372.96 లక్షలనుంచి కేటాయింపు 1972–73లో రూ. 1,642.60 లక్షలకు పెంచబడింది. ఈ పెరుగుదల ముఖ్యంగా విద్య, వైద్యం, బస్తీ నీటిసప్లై, గ్రామీణ నీటిసప్లై, షెడ్యూల్డు కులాల, వెనుకబడ్డ వర్గాల సంక్షేమం పద్దులక్రింద జరిగింది. ప్రణాళిక మొత్తం వ్యయం తగ్గించబడినప్పటికీ, కొరదలా పథకాలను పూర్తిగా నిర్వర్తించేందుకు, దుర్బలవర్గాల సాంఘిక అభ్యున్నతి విస్తృతమయేట్టుగానూ, ఉద్యోగావకాశాలు అధికమయ్యేంతగాను ప్రాధాన్యాల క్రమంలో మార్పు తేబడింది.

ప్రణాళికావ్యయపు ప్రాంతీయ కేటాయింపుకుగాను, 1971–72 లో అనుసరించిన సూత్రమే ఈ ఏడాది అనుసరింపబడింది. ప్రణాళికా వ్యయంలో 90 శాతం జనాభా ప్రాతిపదికపైన, మిగతా పదిశాతం 5 : 3 : 2 నిష్పత్తిపైన తెలంగాణా, రాయలసీమ, కోస్తా ఆంధ్రాకు వరుసగా నిర్దేశించబడింది. ప్రణాళికా ప్రాంతీయ భాగం ఇలా ఉంటుంది—

| | రూ. కోట్లలో |
|---|---|
| కోస్తా ఆంధ్రా ... ... | 39.87 |
| రాయలసీమ ... ... | 20.45 |
| తెలంగాణా ... ... | 36.02 |
| | 96.34 |

తెలంగాణా ప్రత్యేక అభివృద్ధి పథకాలకు కేటాయించబడిన నిధులు కాకఅన్నమాట పై మొత్తాలు.

తెలంగాణాలో ప్రత్యేక అభివృద్ధి పథకాల పెట్టుబడికై కేంద్ర ప్రభుత్వం సమకూర్చిన ప్రత్యేక సహాయంలోంచి రూ. 942.52 లక్షల మొత్తం 1972–73 ఓట్ ఆన్ అకౌంట్ బడ్జెట్‌లో చూపబడింది. వివిధ అభివృద్ధి కార్యక్రమాలను గురించిన వ్యయాలకు సంబంధించిన వివరాల గురించి ఆంధ్రప్రదేశ్ ప్రాంతీయసంఘం పరిశీలిస్తోంది. ఈ సంఘం ఆమోదించేలోపల, కొరదలా పథకాల పని కొనసాగింపబడుతోంది. పని తరుణం మించిపోకుండా ఈ ఏడాది ప్రతిపాదించిన భారీ మొత్తాలు—గ్రామీణ విద్యుచ్ఛక్తి (రూ. 300 లక్షలు), పోచంపాడు ప్రాజెక్టుతో సహా నీటిసాగు (రూ. 305 లక్షలు), సురక్షిత మంచినీటి సప్లై పథకాలు (రూ. 97.50 లక్షలు,) రహదార్లు (రూ. 85 లక్షలు), సాంఘిక సంక్షేమ పథకాలు (రూ. 45 లక్షలు).

1971–72 లో తెలంగాణా అభివృద్ధి సంఘం రెండుసార్లు సమావేశమైంది. ప్రణాళికా నిర్వహణ సంఘం కూడా తెలంగాణాకు చెందిన మామూలు ప్రణాళికా పథకాల గురించి, తెలంగాణా ప్రత్యేక అభివృద్ధి గురించి సమీక్షించింది—జరిగిన పురోగతి విషయమై ఈ యేడాది ప్రధానమంత్రి సమీక్షా సంఘం అష్టసూత్ర కార్యక్రమం ఎంతవరకు అమలు జరిగిందీ సమీక్షించింది."

బడ్జెట్ ప్రసంగం ముగిస్తూ, ఆర్థికమంత్రి యిలా అన్నారు:–

"అత్యంత దారిద్ర్యంలో మగ్గుతున్న లక్షలాది ప్రజల జీవనపరిస్థితులను ప్రగతివైపు మార్చటానికని ఉద్దేశింపబడిన ఎన్నో కార్యక్రమాలను నేను పేర్కొన్నాను. ఈ వివిధ కార్యక్రమాలకు ఒకే అంతస్సూత్రం ఉంది. అదేమిటంటే, రాజ్యాంగపు హామీని ఆచరణలోకి తేవాలనేది ప్రభుత్వపు అచంచల దీక్ష అని గౌరవ సభ్యులకు తెలుసు. ఈ రాజ్యాంగపు హామీ ఇది... "జాతీయ జీవనపు అన్ని సంస్థలలోనూ సాంఘిక, ఆర్థిక, రాజకీయ న్యాయం వర్తించేట్టుగావుండే సాంఘిక వ్యవస్థను సమకూర్చటంద్వారానూ భద్రపరచడంద్వారానూ ప్రజల సంక్షేమాన్ని పెంపొందించటానికి ప్రభుత్వ వ్యవస్థ కృషి చేయాలి." ఈ హామీని ఆచరణసత్యంగా రూపొందించాలి. అయితే యిందుకు చాలాదూరం పయనించవలసి వుంటుందని నాకు తెలుసు. ఈ గమ్యాన్ని చేరటానికి ప్రభుత్వం కృతనిశ్చయంతో వుంది. కాగా, ఈ మార్గాన మనకు అండదండలుగా వుండగల ప్రజా సహకారం మనకు వున్నదని గుర్తిస్తున్నాం. ఈ గుర్తింపువలన కృతనిశ్చయంవలన మన లక్ష్యసాధన కొంత తేలిక కాగలదు. దారిద్ర్యంలో మగ్గుతూ, అధోగతిని అణచివేయబడిన ప్రజలను సంక్షేమంవైపు నడిపించే ఈ యాత్రలో పాల్గొనవలసిందిగా మీ అందరినికూడా ఆహ్వానిస్తున్నాను."

# అజాత శత్రుడు



వి. యస్. గోపాల్

ఆత డజాత శత్రుడు

అతడు నాకు వెలలేని మిత్రుడు
అతడు సౌజన్యమూర్తి
మితభాషి మిత్రవరుడు
అతడు ప్రేమపాత్రుడు
అత్యంత సన్నిహితుడు
అతని హృదయము నవనీత
మతని స్నేహమ్ము సౌఖ్యప్రదము

అతడు నవ్విన చిరునవ్వు
కోటివెన్నెలలు కురియు
అతని సాయుజ్య మత్యంత
శాంతిప్రదము
అతని దాపుల కవితలు
వెల్లివిరియు
అతని చూపుల చల్లని
వెన్నెలలు కురియు :

అతడు పులులను
సౌమ్యముగ సాకగలడు
అతడు హరిణాలర
వాటి దాపున నిలువగలడు :
అతడు స్వచ్ఛగంగాతరంగాల
మరపించు సఖుడు
అతడు స్నిగ్ధహిమవన్నగాగ్ర
వినిర్గత భానుకిరణ
మతడు నిశ్చల స్వచ్ఛ
స్ఫటిక దర్పణము

అతడు అన్యాయములను, అక్రమములను
అనవసర ప్రసంగములను
సహించలేని
సౌజన్యమూర్తి

మిత్రభేదమతని కత్యంత
జుగుప్సాకరము
శత్రువులనయిన క్షమియించి
వదలునట్టి సౌమ్యత
అతనిసొమ్ము !

దళిత వర్గాల కతడు మార్గదర్శి
దగాపడినట్టి తమ్ములకితడు అన్న !
భారతావని కన్న బంగారు కలల ఫలము
భరత జనయిత్రి నోచిన నోము పంట
అతని వద్దకు వచ్చినవారు తిరిగి
సంతసమ్ముగ మరలిచనెడివారు
అతని ఆవాసమొక సాహితీ
ప్రాంగణమ్ము
అతని సాహితీ గరిమ
సహృదయ సమ్మతమ్ము.

(సంజీవయ్య స్మృతికి)



# చిలకమర్తివారి స్వీయ చరిత్రలో

# ప్రకాశంగారి ప్రస్తావన

రేపూరు అనంత పద్మనాభరావు

చిలకమర్తి లక్ష్మీనరసింహంగారికి టంగుటూరి ప్రకాశం పంతులుగారు అత్యంత సన్నిహితులు. చిలకమర్తివారు తమ స్వీయ చరిత్రలో ప్రకాశంగారి జీవితములోని కొన్ని మధుర ఘట్టములను ప్రస్తావించియున్నారు. ప్రకాశంగారిపై చిలకమర్తివారి కెనలేని గౌరవము. ప్రకాశంగారు చిలకమర్తివారి నాటకములన్నింటిలో పాత్రధారణ చేసినవారే! చిలకమర్తివారిట్లనిరి: 'ప్రకాశంగారి రూప, బుద్ధి విశేషము మొదలగునవి నాకు మిక్కిలి సంతోషప్రదముగ నుండినందున నాతని యెడల నాకు మిక్కిలి యిష్టము గుదిరెను. ఆయన మెట్రిక్యులేషను పరీక్షలో కృతార్థుడైన దినమున నేను 2 రూ॥ లు ఖర్చుపెట్టి చీనా మిఠాయి దెప్పించి మిత్రులకు బంచి పెట్టితిని.' వారొకరినొకరు 'ఏమిరా?' యని పిలుచుకొనెడివారట! అతడు చెన్నపురిలోనున్నను, ఇతడు రాజమండ్రిలోనున్నను వారి హృదయములు సమీపముననే యుండెడివట! స్వీయ చరిత్రమున 'ప్రకాశముగారి సీమ ప్రయాణము' అను ప్రకరణమే రచించెను.

ప్రకాశంగారి రూపమును చిలకమర్తివారు వర్ణించిన విధము రమణీయము. ప్రకాశముగారి వేషధారణ ఆనాడిట్లుండియుండును. ఆశువుగా చిలకమర్తి ఈ పద్యమును చెప్పిరట:

"ఈగ వ్రాలినగాని వేగజారెడునట్లు
మవ్వంపు కురులను దువ్వినాడు
వరలలాటమునందు దిరుచూర్ణరేఖను
ముద్దుగారెడు భంగి దిద్దినాడు
అరుణపల్లవమట్లు కరమురంజిల్లు చెం
గావి వస్త్రంబును గట్టినాడు
చారలంగరఫాను జక్కగా ధరియించి
పరివాటు కండువ వైచినాడు

చెవులసందున గిరిజాలు చిందులాడ
మొగముమీదను జిరునవ్వు మొలకలెత్త
టంగుటూరి ప్రకాశము రంగు మెఱయ
ధవళగిరి తీర్థమునకును దరలివచ్చె."

1890 డిసెంబరులో మెట్రిక్యులేషన్ పరీక్షలో ప్రకాశంగారు కృతార్థులైరి. అప్పటి కాయనకు రమారమి 16, 17 సం॥ల వయస్సు, ఆ సంవత్సరము వేసవి కాలపు సెలవులలో ప్రకాశంగారికి వివాహమయ్యెను. ప్రకాశముగారు బాలుడు, తెలివి గలవాడు, సుందరరూపి. హనుమంతరావునాయుడుగారి నాటక సమాజములో ప్రకాశంగారు సభ్యులుగానుండి, నాటకములాడుచుండెడివారు. హనుమంతరావునాయుడుగారుగాని, ప్రకాశముగారుగాని పద్యములు చదువలేరు. వారి సమాజములో తదితరులు పద్యములు పాడుచుండెడివారు.

ప్రకాశముగారు నాటకములో నేరసము నభినయించినను మిక్కిలి సొగసుగ నభినయించెడివారు, కరుణ రసమునకును, వీరరసమునకును పెట్టినదిపేరు. కీచకవధ నాటకమున ప్రకాశముగారు ద్రౌపదీ పాత్ర ధరించెడివారు. ద్రౌపదీ పరిణయమున 'అర్జున పాత్ర' ధరించి వీరరస మభినయించుటలో ప్రకాశముగా రద్వితీయులు. ఆ నాటకమున 4వ అంకమున వీరరస మభినయించుటకు మిక్కిలి యవకాశముండెను. అది ప్రకాశముగారు మిక్కిలి

యద్భుతముగ ప్రదర్శించెడివారు. గయోపాఖ్యానమున రెండవ యంకమున చిత్రరేఖ పాత్రను, 3వ అంకమున 5వ అంకమున అర్జున పాత్రను ధరించి కన్నులపై కుంఠముగా ప్రదర్శించెడివారు. వారు రంగస్థలము మీద మూర్తీభవించిన వీరరసమువలె నుండెడి వారు. పారిజాతాపహరణమున సత్యభామ పాత్రను ధరించి, ఆయా రసమును బట్టి యాయన ముఖవైఖరి, కంఠస్వరము మార్చుట జూచి, ప్రేక్షకులు మహదానందమును బొంది చప్పట్లు గొట్టెడివారు. 'నల' నాటకమున దమయంతి పాత్రను సారంగధర నాటకమున రత్నాంగి పాత్రను, ధరించెడివారు.

## స్వతంత్రుడు

1891 సంవత్సరమున దొరలు నాటకసమాజమువారు ప్రదర్శించిన హరిశ్చంద్ర, నాటకమును చూచి, మరునాడుదయము ఫోటోగ్రాపులు తీసుకొని సీమకు బంపెదమని హనుమంతరావు నాయుడుగారినడిగిరి. తనమాట కద్దుచెప్పువారెవరు లేరనుకొని నాయుడుగారు సమ్మతించిరి. కాని, తన ప్రియ శిష్యుడును, ప్రేమాస్పదుడును, పుత్రప్రాయుడునైన ప్రకాశముగారే దానికి అంగీకరింపరైరి— 'పీర్ల పండుగలో వచ్చెడి నాడు వేషములవలె నేను పట్టపగలు వేషము వేయుదునా? నేనొప్పుకొన'నని తిరస్కరించిరి. ప్రకాశముగారు చిన్ననాటనుండియు నన్ని విషయములలోను స్వతంత్రుడు తనకు యుక్తమని తోచినపనిగాని జేయడు.

ప్రకాశముగారు రాజమండ్రిలో పారిజాతాపహరణ నాటకమున నటించినప్పుడు శ్యామసుందర రాజగురువను నొక ఓఢ్ర యువకుడు ప్రకాశమునకు 'రంగనక్షత్ర' (Star of the Stage) మను బిరుదునిచ్చెను. కాకినాడలో కొందరు నాటకము సరిగా జరగకుండ చూడయత్నించిరి. ప్రకాశమునకు కాకినాడలో జరిగిన చిక్కులు త్వరగ మరుపురాలేదు. సమయము వచ్చినప్పుడు కాకినాడ వారిమీద పగదీర్చుకోవలెనని మనసులో నుండెను. ఆ కక్ష విషయమున ప్రకాశముగారిపై కోర్టులో వ్యాజ్యముగూడ నడిచినది.

1891 డిసెంబరులో జరిగిన ప్రథమ శాస్త్రపరీక్షలో ప్రకాశంగారు కృతార్థులైరి. వారితో సహాధ్యాయులుగా సర్ కూర్మా వెంకటరెడ్డి నాయుడు ప్రభృతులు చదివిరి. ప్రకాశముగారు బి. ఏ. తరగతిలో చేరలేదు. 1892 సం॥న నలచరిత్రమున దమయంతి పాత్రను ధరించిరి. ఆ సంవత్సరము ఫస్టుగ్రేడ్ న్యాయవాదిగా పరీక్షకు దరఖాస్తు చేసిరి. ఆ తర్వాత మునిసిపల్ సభ్యుడుగాను న్యాయవాదిగాను నుండుటచే నాటకములలో పాల్గొనుట మానిరి.

రాజమండ్రి మునిసిపాలిటీకి అధ్యక్షులుగా 1903లో ప్రకాశముగారెన్నుకోబడిరి. 1904లో బారిష్టరు పరీక్షకు జదువుటకై ఇంగ్లండు వెళ్లిరి. 1905 జూలై 16న సీమనుండి తిరిగి వచ్చిరి. తిరిగి వచ్చిన సందర్భమును పురస్కరించుకొని చిలకమర్తివారు వారి మిత్రులు ప్రకాశముగారికి విందుజేసిరి. విందునకు వచ్చినవారి పేర్లు నిర్భయముగ సత్యవాదినీ పత్రికలో ప్రకటించిరి. ప్రకటింపబడినతోడనే పట్టణములో గొప్ప సంక్షోభము బయలుదేరెను. వూరు అట్టుడికినట్లుడికెను. సీమ వెళ్ళిన వారితో భుజించుట మహాపాతకమని యభిప్రాయపడి సభాపతులు మొదలగు వైదిక శిఖామణులు సంఘమర్యాద గాపాడుకొనుటకు గొప్ప సభజేసిరి. ఆ విందు విషయము మఠాధిపతులైన శంకరాచార్యులవారికి తెలియజేసిరి. ఆ స్వాములవారు వెంటనే సీమ వెళ్ళినందుకు ప్రకాశంగారికి, విందు జేసినవారికి వెలిపత్రికలు పంపి, విందులో పాల్గొన్న చిలకమర్తి వంటి వారికి ఆంక్షపత్రికలు పంపక, 'మీరు ప్రకాశముగారికి జేసిన విందులో పాల్గొన్నారట నిజమా?' యని ప్రశ్న వేయుచు శ్రీముఖములు బంపిరి.

## వెలి పత్రికలు

శ్రీ శంకరాచార్యస్వాములవారు ప్రకాశంగారితో భోజనము చేసిన వారికి వెలి పత్రికలు బంపుటకై ప్రయత్నముజేసిరి. స్వాములవారు రాజమహేంద్ర వరమువచ్చి శంకర మఠములో బస చేసిరి. ఆంక్ష పత్రికలుపసంహరింపుమని వారిని వినయముతో వేడుకొనుటకై పురజనులొక యేకాదశి నాడు మధ్యాహ్నము సభ జేసిరి. స్వాములవారాసభకు తమయేనుగునెక్కివచ్చిరి 'ప్రకాశముగారికిని, వారితో భోజనము చేసినవారికిని వెలి పత్రికలు పంపకు' డని ఒకరు కోరిరి పూర్వాచారపరాయణులు ఆయన నధిక్షేపించిరి సభలో కలకలము బయలుదేరి స్వాములవారు దొడ్డి గుమ్మము దారినిబోయి శంకర మఠము జేరిరి.

ప్రకాశంగారు 1905 సంవత్సరమున రెండవసారి సీమకు వెళ్ళిరి, 1936 సం॥న చెన్నపురి శాసన నిర్మాణసభా సభ్యత్వముల కెన్నికలు జరిగెను. ఆ ఎన్నికలలో గెలిచిన ప్రకాశంపంతులుగారు రెవిన్యూ మంత్రియయ్యెను. ఆ మహాపదవిలో నుండి వారు రాజమహేంద్రవరము వెళ్ళినపుడు వారిని గౌరవించుటకు 'పాలచౌకు'లో నొక మహాసభ జరిగెను. ఆ సభకు ప్రకాశముగారి బాల్య మిత్రులగు చిలకమర్తి వారిని అధ్యక్షులుగ పురజనులు వుండమని కోరిరి. అదియొక గౌరవముగ భావించినారు చిలకమర్తివారు! వారిరువురి అన్యోన్యమైత్రి యట్టిది.

రామాయణానికి సంబంధించిన నాటకాలలో కౌసల్య ఆవేశమనే భాగమును ప్రకాశంగారు నటించుటలో ఎంతో ఉద్వేగమును ప్రదర్శించెడివారు. గర్భంలోనున్న శ్రీరామచంద్రుడు రావణుని దుర్ణయములను కౌసల్య నోటవెంబడి ఆవేశముగ వెళ్ళగ్రక్కు నా సన్నివేశము భయంకరముగా నుంచెడిదట! రాజమండ్రికి నాటి కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ పి. ఆనందాచార్యులుగారు విచ్చేసినసందర్భములో ప్రకాశంగారి నటకౌశలాన్ని వారుచూచి ప్రకాశం నటనకు సంతోషించి గొప్ప బహుమానాన్ని యిచ్చి సత్కరించారు. ఇట్టి మధుర ఘట్టములను చిలకమర్తివారు తమ స్వీయచరిత్రముతోబాటు నిక్షిప్తముజేసి ఆంధ్రులకు నాటి విశేషములు తెలిసికొను భాగ్యమును గలిగించిరి. ప్రకాశంగారి స్వీయచరిత్ర విశేషముగ తెలిసికొనగోరు వారు పఠింపవచ్చును.



# ఆంధ్ర ప్రదేశ్‌లో పారిశ్రామికాభివృద్ధి

# అనంతమైన ప్రకృతి సంపదలు

యస్. కామరాజు పంతులు

అనంతమైన ప్రకృతి సంపదలతో తులతూగే ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో, అష్టైశ్వర్యాలూ ఉండి, నిత్య దరిద్రం ఎందుకూ అని అప్పుడప్పుడూ అనిపిస్తుంది. భారతావని యావత్తులో ఖనిజ సంపదలో ఆంధ్రప్రదేశ్ నాలవ స్థానం ఆక్రమిస్తుంది. ప్రతి సంవత్సరం, కనీసం 14.15 కోట్ల రూపాయల ఖనిజసంపద లభిస్తున్నది భారత దేశపు ప్రతి సంవత్సరపు మొత్తం ఖనిజ సంపద ఉత్పత్తిలో ఆరు శాతము వరకు, ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రంలోనే లభ్యమవుతున్నది. క్రిసొటైలు, ఆస్బెస్టసు ఖనిజములు కేవలము ఒక ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోనే లభ్యమవుతున్నవి. ఇవేకాక బొరైటు, బొగ్గు, సిమెంటు, సిమెంటు పరిశ్రమకుపయోగించే మొదటి తరగతి సున్నపురాయి, సుద్ద, మాంగనీసు, అభ్రకము, క్వార్ట్జు, స్టీటైజు, ఎపటైటు మొదలగు అనేక ముఖ్యమైన, కీలక ఖనిజ పదార్థములు లభ్యమవుతున్నాయి. ఈ అన్ని ఖనిజములు భారతదేశపు మొత్తం ఉత్పత్తిలో కనీసం 50 నుంచి 80 శాతము వరకు ఉత్పత్తి ఆంధ్ర ప్రదేశ్ నుంచే. ఆంధ్ర ప్రదేశ్‌లో దొరకని ఖనిజమంటూ లేదనుటలో అతిశయోక్తి లేదేమో ? విశాఖ పట్నం, శ్రీకాకుళం జిల్లాలలో దొరకే అపటైటు, పశ్చిమ గోదావరి జిల్లాలలోని భీమడోలు ప్రాంతములో సుద్ద, అనంతపురం, కర్నూలు, ఖమ్మం, కృష్ణా, కడప జిల్లాల్లో లభ్యమయ్యే బొరైట్సు, అనంతపురం జిల్లాలోని కాల్సైటు, తూర్పు గోదావరి, నల్గొండ, ఆదిలాబాదు, అనంతపురం జిల్లాల్లోని చీనాక్లే, కృష్ణాజిల్లాలోని కొండపల్లి ప్రాంతంలోను, ఖమ్మం జిల్లాలో లభ్యమయ్యే క్రోమైటు, కడప జిల్లాలోని పులివెందల ప్రాంతములోను, కర్నూలు, అనంతపురం జిల్లాల్లోని పలు తావులలో లభ్యమయ్యే క్రిసొటైలు ఆస్బెస్టసు ఆదిలాబాదు, కరీంనగర్, వరంగల్లు జిల్లాలలోను, ఖమ్మం జిల్లాలోని రామగుండం, ఎల్లందు, కొత్తగూడెం ప్రాంతములలోను, ఉభయ గోదావరి జిల్లాలలోనూ దొరికే బొగ్గు గుంటూరు జిల్లాలలోని పెదగవల కొండ, అగ్ని గుండాల ప్రాంతములోను, ఖమ్మం జిల్లాలోను, మైలారం ప్రాంతములోను, కర్నూలు జిల్లాలోని గని ప్రాంతములోను దొరకే రాగి, అనంతపూరు, నల్గొండ, కడప, కర్నూలు, గుంటూరు, కృష్ణా జిల్లాలలోని అనేక ప్రాంతములలో రత్నాలు, ఆదిలాబాదు జిల్లాలోని అసీఫాబాదు ప్రాంతములలోను, రాష్ట్రంలోని ఇతర బొగ్గు గనుల సమీప ప్రాంతములలోను లభ్యమయ్యే ఫైర్‌క్లే, కడప జిల్లాలోని పలకరాయి, నాము, చిత్తూరు జిల్లాలోని కంగుంది సంస్థానములోను, ఖమ్మం ఉభయ గోదావరి జిల్లాలోని గ్రాఫైటు, అనంతపురం, కడప, కర్నూలు, వరంగలు, కృష్ణా జిల్లాల్లోని పలు ప్రాంతములలో లభ్యమయే ఇనుము, గుంటూరు జిల్లాలోని అగ్నిగుండాల ప్రాంతములోను, కడప జిల్లాలోని పులివెందుల ప్రాంతములోను లభ్యమయే సీసము, తగరము, తుత్తునాగము హైదరాబాదు, ఆదిలాబాదు, నల్లగొండ, మహబూబునగర్, కర్నూలు, విశాఖ పట్నం, కడప, అనంతపురంలోని అనేక ప్రదేశములలో దొరికే సున్నపురాయి విశాఖపట్నం, శ్రీకాకుళం జిల్లాలలో లభ్యమయే మాంగనీసు, నెల్లూరు జిల్లాలోని గూడూరు పరిసర ప్రాంతములలోను, విశాఖపట్నం జిల్లాలోని మాగిగూడెం ప్రాంతములోను లభ్యమయే అభ్రకం, హైదరాబాదు ప్రాంతములో దొరికే సిలికా, క్వార్ట్జు, కోస్తా ప్రాంతములో దొరికే ఉప్పు, అనంతపురం, కర్నూలు, మహబూబునగరు జిల్లాలోని అనేక ప్రాంతములలో లభ్యమయే స్టిటెటు (టాల్కు), కర్నూలు జిల్లాలోని అ[illegible] సముద్రం, గుటుపల్లి ప్రాంతములలో దొరికే వజ్ర[illegible], తూర్పు గోదావరి జిల్లాలోని అనేక ప్రాంతములలో దొరికే వోల్ఫ్రామైటు (టంగస్టను) సద్వినియోగపరచుకొంటే ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఎన్ని పరిశ్రమలయినా నెలకొల్పవచ్చును. ఆంధ్ర ప్రదేశ్ భారత దేశంలోని అన్ని రాష్ట్రాలలో పారిశ్రామికాభివృద్ధిలో అగ్రతాంబూలం పుచ్చుకొంటుంది. కనీసం మరో పది లక్షల మందికి జీవనోపాధి లభ్యమవుతుంది. వాడవాడలా లఘు పరిశ్రమలు నెలకొల్పవచ్చు. ఆంధ్రప్రదేశ్‌లోని ఆర్థికోన్నతి, అభ్యుదయం, ప్రగతి ద్విగుణీకృతమవుతాయి.

ఈ అపారమైన ఖనిజ సంపదలతోడు, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని వృక్షసంపద, అడవులను గురించి చెప్పుకోనే పనే లేదు. రాష్ట్రం మొత్తం భూ విస్తీర్ణంలో 22.5 శాతము భూ భాగము అడవులతోనే నిండియున్నది. శ్రీకాకుళం, ఉభయ గోదావరి, విశాఖపట్నం, కర్నూలు జిల్లాలలోని దట్టమైన అడవులలో వివిధ రకములయిన అమూల్య వస్తువులు అత్యధిక ప్రమాణములో లభ్యమవుతున్నాయి. ఉదాహరణకు: కలప, [illegible], బొంగులు, బీడీ ఆకులు, గంధపు చెక్క, లక్క, తేనె, [illegible]కాయి గింజలు, ఔషధముల ఉత్పత్తిలో ఉపకరించే రకరకాల ద్రవ్యములు అనేకం లభిస్తున్నాయి. ఆంధ్రప్రదేశ్‌లోని [illegible] సంపదనంతటిని వ్యాపార దృష్టితో సక్రమంగా అభివృద్ధిచేసి, ఈ అడవులలో లభ్యమయే పదార్థములన్నిటిని పారిశ్రామికాభివృద్ధికి తరలించే అవకాశాలు ఎనలేనన్ని ఉన్నాయి. ఆంధ్రప్రదేశ్‌లోని

లఘు పరిశ్రమల ప్రగతికి ఈ అపారమైన వృక్షసంపద ఎంతయినా అనుగుణ్యంగా ఉంటుంది.

కృష్ణా, గోదావరి, తుంగభద్ర, పెన్నారు, వంశధార, నాగావళి మొదలగు అనేక నదులు, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం యావత్తు సస్య శ్యామల మొనరించుటయే గాకుండా, అనంతమైన జలవిద్యుదుత్పత్తికి అవకాశాలు కలిగి యున్నాయి. భారతావని యావత్తులో ఆంధ్రప్రదేశ్, పొడవైన నదులు కలిగియున్న రాష్ట్రాలలో నాలవస్థానము ఆక్రమిస్తుంది. 757 కిలో మీటర్ల పొడవున నదులు ప్రవహిస్తున్నాయి. కేంద్ర జలు వాటరు పవరు కమీషను వారి అంచనాల ప్రకారము, భారత దేశం మొత్తంలో ఉత్పత్తికాగల జలవిద్యుత్తులో ఆరవవంతు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఇమిడియున్నది. 2500 మెగావాట్ల జలవిద్యుదుత్పత్తి చేసే అవకాశాలు ఆంధ్రప్రదేశ్‌లో ఉన్నట్లు సెంట్రల్ వాటరు పవరు కమీషనువారి లెఖ్ఖల ప్రకారము. కాని మనకున్న ఈ అపారమైన ప్రకృతి సంపదలో చాలా కొద్ది భాగము మాత్రమే ప్రస్తుతము వినియోగపరచు కొంటున్నాము. భారత దేశపు తలసరి సగటు 65 కిలోవాట్ల విద్యుత్తు ఉపయోగము అయితే ఆంధ్రప్రదేశ్‌లో 26 కిలోవాట్లు మాత్రమే! అంటే భారత దేశపు తలసరి సగటులో మూడవవంతు మాత్రమే అన్నమాట. పారిశ్రామికాభివృద్ధికి జలవిద్యుత్తు ఉపయోగములో భారత దేశము అన్ని రాష్ట్రాల లెఖ్ఖలు తీసుకుంటే ఆంధ్రప్రదేశ్ పదమూడవ స్థానము ఆక్రమిస్తుంది. భారత దేశపు సగటు విద్యుత్తు ఉపయోగము పారిశ్రామికావసరములకు 43 కిలోవాట్లు హవర్లు అయితే ఆంధ్రప్రదేశ్ సగటు దానిలో మూడవ వంతు మాత్రమే.

ఇక మత్స్య పరిశ్రమ అభివృద్ధికి ఆంధ్రప్రదేశ్‌లోగల అవకాశాలను గురించి చెప్పవలసిన అవసరమేలేదు. 1000 మైళ్ళ పొడవున తీర ప్రాంతము, 3200 చదరపు కిలోమీటర్ల చేపలు పట్టుటకు అనువయిన రేవులు, 1500 మైళ్ళ పొడవున ప్రవహించే నదులు, ఇవికాక అనేక సరస్సులు, చెరువులు. కుంటలు, ఎనిమిది లక్షల హెక్టార్ల విస్తీర్ణము గలిగిన చేపల కుంటలుగల ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో మత్స్యపరిశ్రమ ఏమంతగా చెప్పుకోదగినట్లుగా అభివృద్ధి చెందలేదు. ఇంతవరకు. ఆంధ్రప్రదేశ్‌లోని ఏటా మత్స్యపరిశ్రమ ఉత్పత్తి 2.25 లక్షల టన్నులకు మించి యుండలేదు సముద్ర తీరములోను, నదీతీరములలోను, సరస్సులలోను ఎంతగానో మత్స్యపరిశ్రమ అభివృద్ధి చేయవచ్చును మన ప్రకృతి సాధన సంపత్తులన్నింటిని సక్రమంగా అభివృద్ధిపరిస్తే.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని పారిశ్రామికాభివృద్ధికి దోహదం చేసే మరో ప్రకృతి సాధన సంపత్తి వ్యాపార పంటలు. వేరుశనగ, ఆముదాలు, పత్తి, చెరుకు, పొగాకు మొదలగు అనేక వ్యాపార పంటలకు ఆంధ్రప్రదేశ్ ఆలవాలము. ఈ వ్యాపార పంటల సాధన సంపత్తులను సక్రమ మార్గాలలో వినియోగపరచు కొంటే, పారిశ్రామిక రంగంలో ఆంధ్రప్రదేశ్ ముందడుగు వేస్తుంది. భారత దేశము మొత్తంలో అగ్రస్థానము వహిస్తుంది. ప్రతి ఏటా 99.27 కోట్ల రూపాయల వేరుశెనగ పంట, 0.72 కోట్ల రూపాయల ఆముదాలపంట, 1.43 కోట్ల రూపాయల పత్తి పంట, 195.66 కోట్ల రూపాయల చెరుకు పంట, 76.91 కోట్ల రూపాయల పొగాకు పంటలతో ఆంధ్రప్రదేశ్‌లో ఎన్ని కొత్త పరిశ్రమలయినా స్థాపించవచ్చు. పారిశ్రామిక రంగంలో ఎంతయినా అభివృద్ధి సాధించవచ్చు. భారత దేశం మొత్తం వేరుశనగ పంటలో ఆంధ్రప్రదేశ్ అయిదవ వంతు పండిస్తుంది. కర్నూలు, చిత్తూరు, కడప, మహబూబునగరు, గుంటూరు జిల్లాలలో వేరుశనగ పంట పండించే ముఖ్యమయిన ప్రాంతములు. ఒక్క చిత్తూరు జిల్లాలోనే రాష్ట్రం మొత్తం పంటలో నాలవవంతు పండుతున్నది. మన దేశం మొత్తం చెరుకు పంటలో ఆంధ్రప్రదేశ్ పదవ వంతు పండిస్తున్నది. నిజామాబాదు, విశాఖపట్నం, చిత్తూరు, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి జిల్లాలలో చెరుకు పంట ఎంత విరివిగా పండుతుందో! ఒక్క పశ్చిమ గోదావరి జిల్లాలోనే రాష్ట్రం మొత్తం పంటలో నాలవ వంతు పంటపండుతున్నది. భారత దేశపు ఆముదపు పంట మొత్తంలో ఆంధ్రప్రదేశ్‌లోనే సగానికి సగం పైగా పండుతున్నది. మహబూబునగరు, నల్గొండ, హైదరాబాదు, నెల్లూరు, అనంతపురం జిల్లాలోని ఆముదాల పంటను గురించి చెప్పనవసరంలేదు భారత దేశపు పత్తిపంట మొత్తంలో ఆంధ్రప్రదేశ్‌లో మూడవభాగము పంట పండుతున్నది ఆదిలాబాదు కర్నూలు. కృష్ణా. కడప, అనంతపురం, గుంటూరు జిల్లాలు ప్రత్తిపంట పండించే ముఖ్యప్రదేశములు విశ్వ విఖ్యాతిగాంచిన వర్జీనియా పొగాకు పండించే ముఖ్యప్రదేశములలో గుంటూరుజిల్లా ఒకటి. అత్యుత్తమ శ్రేణికి చెందిన వర్జీనియా, మరి ఇతర ఇతర రకములయిన పొగాకు పంటలు ఒక్క ఆంధ్రప్రదేశ్ రాష్ట్రములోనే భారత దేశం మొత్తంమీద భారత దేశపు మొత్తములో వర్జీనియా పొగాకు పంటలో ఒక్క ఆంధ్రప్రదేశ్‌నుంచే నాలుగింట మూడు వంతులు పండుతున్నది. వర్జీనియా పొగాకు పంటలో గుంటూరు జిల్లాదే అగ్రతాంబూలం. ఇదిగాక. ఉభయగోదావరి, కృష్ణా. కర్నూలు ఖమ్మం జిల్లాలలో గూడా చెప్పుకోదగ్గ పరిమాణంలో ఈ పంట పండుతున్నది.

## పారిశ్రామిక రంగంలో . . . . .

ఇన్ని ఐశ్వర్యాలు. అపారమైన ప్రకృతి సంపద కలిగియుండి గూడా ఆంధ్రప్రదేశ్ పారిశ్రామిక రంగంలో ఎంతో వెనుకబడి యున్నది భారత దేశంలో పారిశ్రామికంగా వెనుకబడి యున్న రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ గూడా ఒకటి. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో మొత్తం ఆదాయంలో పారిశ్రామిక రంగం నుంచి బొటా బొటిగా 3.5 శాతము వంతు మాత్రమే లభ్యమవు తున్నది. భారత దేశం మొత్తం ఆదయంలో 11.5 శాతము పారిశ్రామిక రంగం నుంచి వస్తున్నది. అన్ని రాష్ట్రముల ఆదాయముల లెక్కలను పరికించితే (పారిశ్రామిక రంగం నుంచి వచ్చేది) ఆంధ్రప్రదేశ్ 12వ స్థానం ఆక్రమిస్తుంది. తలసరి సగటున పారిశ్రామిక రంగం నుంచి లభ్యమయ్యే ఆదాయం భారతదేశం మొత్తంమీద 39 రూపాయలు అయితే, ఆంధ్రప్రదేశ్‌లో పారిశ్రామిక రంగంనుంచి సాంవత్సరిక, తలసగటు ఆదాయము 18 రూపాయలు మాత్రమే!

పారిశ్రామిక రంగం వల్ల ఆంధ్రప్రదేశ్‌లో లభించే ఆదాయము, మహా రాష్ట్రంలో పారిశ్రామిక రంగంవల్ల లభించే ఆదాయములో ఆరవవంతు మాత్రమే అని నిపుణుల అంచనా. ఇట్లాగే కోకొల్లలుగా ఎన్ని అంచనాలు, సంఖ్యలు, నిష్పత్తులు, సగటులు, అయినా ఉదహరించవచ్చును—ఆంధ్రప్రదేశ్ పారిశ్రామిక రంగంలో ఎంత వెనుక పడియున్నదీ నిరూపించడానికి. అతిశీఘ్రంగా ఆంధ్రప్రదేశ్ పారిశ్రామిక ప్రగతి పథంలో ముందుకు సాగిపోవాలి. భారత దేశంలోని తోటి రాష్ట్రాలతో సరితూగవలెనంటే ఆర్థికాభివృద్ధి పథకాలలో సమానంగా ముందుకు పోవాలంటే నిరుద్యోగ సమస్యను తీర్చవలెనంటే, రాష్ట్రంలోని విద్యావంతుల అఖండ ప్రజా సంపత్తును సద్వినియోగ పరచుకోవాలంటే, మన జాతీయ, ఆర్థిక ప్రణాళికలు విజయం సాధించటములో చేదోడు వాదోడుగా చన్నీళ్ళకు వేడినీళ్ళు అన్నటుగా చేతనయినంత సహాయము చేయాలంటే ఆంధ్రప్రదేశ్ సత్వరంగా తనకున్న అపారమైన ప్రకృతి సంపదలన్నిటినీ ప్రణాళికా బద్ధమైన రీతులలో సద్వినియోగం చేసుకొనే మార్గాలు అన్వేషించాలి. అనేక ప్రణాళికలు, పథకాలు అమలుపరచాలి. ప్రాంతీయ కుల మత వర్గ వైషమ్యాలు విస్మరించాలి. లేనియెడల ఆంధ్రప్రదేశ్ అనంతరము భారత దేశపు పారిశ్రామిక రంగంలో అట్టడుగున పడి ఉండవలసిందే. మార్గాంతరము లేదు.

ఆంధ్రప్రదేశ్ తన నాలుగవ ప్రణాళిక మొత్తం 42,050 లక్షల రూపాయల కేటాయింపులో పారిశ్రామికాభివృద్ధికి 1 700 లక్షలు కేటాయించింది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వము, ఇంకా ఇతర సంస్థలు అనేకము గూడా పారిశ్రామిక రంగంలో ఆంధ్రప్రదేశ్ ముందంజ వేయుటకు ఎన్నో విధములుగా ప్రయత్నము లొనరించుచున్నాయి. పది స్థలములలో పారిశ్రామికాభివృద్ధి వాడలు నెలకొల్పబడ్డాయి. రాష్ట్ర ప్రభుత్వ దోహదముతో ఇవేగాక, మంగళగిరి, కె. సి. కాలువ, నాగార్జునసాగరు ఆయకట్టు, రామగుండం, కొత్తగూడెం ప్రాంతములలో గూడా ఈ పారిశ్రామికాభివృద్ధి వాడలు నెలకొల్పటానికి ప్రయత్నములు జరుగుతున్నాయి. లఘు పరిశ్రమల అభివృద్ధి గూడా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అనేక చర్యలు తీసుకొంటున్నది. ప్రయివేటు యాజమాన్యంలో గూడా ఇతోధికంగా పరిశ్రమలు స్థాపించుటకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము, వాటి సంస్థలు, అనేకరకములుగా దోహదం చేస్తున్నాయి. ఇండస్ట్రియలు లైసెన్సులు సంపాదించటములోను, పారిశ్రామిక వాడలలో మంచి స్థలములు ఇవ్వటములోను, తక్కువ ధరలకి నీటి సరఫరా, విద్యుత్తు సరఫరా, అక్ట్రాయిడ్యూటీ మినహాయింపులు, జాయింటు యాజమాన్యంలో పరిశ్రమలు నెలకొల్పటంలో కావలసిన సదుపాయములు ఒసంగుటలోను, ప్రభుత్వపుకొనుగోలు విధానములు సవరించుట ద్వారాను, సేల్సుటాక్సు మినహాయింపులు, వాటరురాయల్టీలు, నాన్ అగ్రికల్చరలు అసెస్‌మెంటు, ప్రత్యేక పారిశ్రామిక ప్రదేశములలో ప్రత్యేక సదుపాయములు ఒసంగుట ద్వారాను, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము అనేక విధములుగా పారిశ్రామిక రంగంలో ప్రయివేటు యజమానులకు సహాయ మొనరించుచున్నది. ఇదిగాక లైసెన్సులు సత్వరముగా ఇచ్చుటకు, అప్లికేషనులు త్వరితగతిని చూచుటకు, ఛీఫ్ సెక్రెటరీ అధ్యక్షతను ఒక ప్రభుత్వ ఉన్నతాధికార సంఘం గూడా నియమింపబడినది

## వివిధ సంస్థల కృషి

ఆంధ్రప్రదేశ్ ఇండస్ట్రియల్ డెవలప్‌మెంటు కార్పొరేషను, ఆంధ్రప్రదేశ్ ఫైనాన్షియలు కార్పొరేషను, స్టేటు బ్యాంకు ఆఫ్ ఇండియా, స్టేటు బ్యాంకు ఆఫ్ హైదరాబాదు, ఇంకా ఇతర జాతీయీకరణ మొనరించబడిన ఇతరయితర బ్యాంకులు ఇత్యాది అనేక సంస్థలుగూడ ఆంధ్రప్రదేశ్ పారిశ్రామిక రంగంలో ముందంజవేయుటకు ఇతోధిక కృషిసల్పుచున్నాయి. ఈ సంస్థలన్నీ కొత్తగా నెలకొనే పరిశ్రమల మూలధనములో కొంత భాగము తీసికొనటముద్వారాను, ప్రత్యక్షముగా అప్పులు యివ్వటముద్వారాను, అప్పులపై హామీలు ఇచ్చుటద్వారాను, సాంకేతిక నిపుణుల సహాయము, సలహాలు, అంచనాలు, సంప్రదింపుల సదుపాయములు కలిగించుటద్వారాను, యంత్రపరికరములు, ముడిపదార్థములు, ఇంకా ఇతరసామగ్రి కొనుగోలు విషయములలో ఆర్థికంగాను, ఇతరత్ర అనేక విధములుగా సహాయమొనరించుచున్నాయి. విదేశ పెట్టుబడిదారులు, కేంద్ర రాష్ట్రప్రభుత్వాల పెట్టుబడులతో సహకార పద్ధతిలో ప్రయివేటు యజమానులు పారిశ్రామిక సంస్థలు నెలకొల్పుటకు కావలసిన యత్నములు జరుపుటకుగూడ అనేక విధములుగా దోహదమొసంగుచున్నాయి. స్టేట్ బ్యాంకు ఆఫ్ ఇండియా, తన 216 బ్రాంచీలద్వారాను, స్టేట్ బ్యాంకు ఆఫ్ హైదరాబాదు తన 139 బ్రాంచీలద్వారాను, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో 1970 సంవత్సరం ఆఖరునకు 8556 లఘు పరిశ్రమల సంస్థలకు 32 కోట్ల రూపాయల ద్రవ్యసహాయము చేసినట్లు తెలుస్తుంది. ఆంధ్రప్రదేశ్ ఇండస్ట్రియలు డెవలపు మెంటు కార్పొరేషను వారుగూడా 53 పారిశ్రామిక సంస్థలకు 8,74 కోట్ల రూపాయల ఆర్థిక సహాయము అందచేసినట్లుగా తెలుస్తున్నది. ఇంజనీరింగు, రసాయనములు, ఎరువులు, సిమెంటు, చక్కెర మొదలగు అనేక పారిశ్రామిక సంస్థలు ఆంధ్రప్రదేశ్ ఇండస్ట్రియలు డెవలపుమెంటు కార్పొరేషను నుంచి ద్రవ్యసహాయము పొందినవి. ఇదిగాక ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఫైనాన్షియలు కార్పొరేషనుగూడా అనేక పారిశ్రామిక సంస్థలకు ఆర్థిక సహాయము చేసినట్లు తెలుస్తున్నది. ఈ ద్రవ్యసహాయము వలన ఎటులేదన్నా 9600 మందికి జీవనోపాధి కలిగింపబడినది. 1970 సంవత్సరములో సగటున ప్రతిరోజు ఒక కొత్తగానెలకొనే పారిశ్రామిక సంస్థకు ద్రవ్య సహాయము చేసినట్లుగా అధికార వర్గాలద్వారా విదితమవుతున్నది. ఇప్పటివరకు 1066 సంస్థలకు 33 కోట్ల రూపాయలకుపైగా అప్పులు ఇచ్చింది ఈ సంస్థ.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వము, కేంద్ర ప్రభుత్వ యాజమాన్యంలో ఉన్న ప్రత్యేక సంస్థలు చేయుచున్న ప్రయత్నములు, ఒసంగుచున్న సదుపాయములు, ఆర్థిక, మరి ఇతర సహాయములను ద్విగుణీకృత మొనరించుటేదప్ప, ఆంధ్రప్రదేశ్ పారిశ్రామిక రంగంలో ముందంజవేయలేదు. ఆంధ్రప్రదేశ్‌లోని చాలా పరిశ్రమలు వ్యవసాయ రంగం నుంచి ఉత్పత్తి [illegible]

మీదనే ఆధారపడి యున్నాయి. ఖనిజసంపద, వనసంపద, పశు సంపద నంటటిని గూడా సంపూర్ణముగా సద్వినియోగం చేసుకోవాలి. అడవుల నుంచి లభించే పదార్థాల ద్వారా నడుపబడుచున్న భారీ పరిశ్రమ ఒక్క కాగితముల పరిశ్రమ మాత్రమే. ఇదిగాక, ఆంధ్రప్రదేశ్‌లో వనసంపదదోహదంతో ఎన్నో పరిశ్రమలు స్థాపించవచ్చు. ఇట్లాగే భారత దేశపు యావత్తు పశుసంపదలో ఆంధ్రప్రదేశ్‌లోనే పదవవంతు పైగా ఉన్నది. కానీ ఆంధ్ర ప్రదేశ్‌లో చెప్పుకోదగ్గ స్థాయిలో ఇంతవరకు చర్మ పరిశ్రమగాని, పాలు, వెన్న, నెయ్యి, పాలపొడి పరిశ్రమలుగూడా అభివృద్ధి చెంద లేదు. ఇదే విధంగా ఆంధ్రప్రదేశ్‌లో లభ్యమయే అనంతమైన ఖనిజసంపద సహాయముతో ఇంజనీరింగు ఇండస్ట్రీసు, వర్కుషాపులు ఇంకా అనేక లఘు పరిశ్రమలు ఎన్నయినా నెలకొల్ప వచ్చును.

హైదరాబాదు విశాఖపట్నం, ప్రాంతములను మినహాయిస్తే ఆంధ్ర ప్రదేశ్‌లో చెప్పుకోదగ్గ భారీ ఎత్తున అభివృద్ధి అయిన పారిశ్రామిక ప్రాంతమేలేదు. గ్రామీణ ప్రాంతములలో పెద్ద సంఖ్యలో వ్యావసాయిక పరిశ్రమలు, (అగ్రో ఇండస్ట్రీసు) స్థాపించుటకు ఎనలేని అవకాశాలున్నాయి ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని వర్గాలవారు, ప్రాంతీయతత్వాలు, విభేదాలు విస్మరించి, శీఘ్రగతిని పారిశ్రామిక రంగంలో ప్రగతి సాధించుటకు ఇతోధిక కృషిసలిపితే అభ్యుదయ పథంలో మిగతా అన్ని రాష్ట్రాలకన్నా ఆంధ్రప్రదేశ్ ముందడుగు వేస్తుంది. ఆంధ్రప్రదేశ్ ప్రజలు అందరికన్నా మిన్న అని ధృవ పరచుకోవచ్చు. కేంద్ర ప్రభుత్వం గూడా ఇప్పటి లాగా ఆంధ్ర ప్రదేశ్ అంటే చిన్నచూపు చూడకుండా, ఆంధ్రప్రదేశ్ అవసరాలకి తగినట్లుగా సహాయము చేయాలి.

---

# సత్యం శివం సుందరం

"మంత్రవాది"

చీకటిగా వుందని
కళ్ళను పొడుచుకుంటున్నా డొకడు
ఆకలిగా వుందని
చిత్తాన్ని చంపుకుంటున్నాడు మరొకడు
హృదయానికి వస్త్రాపహరణం చేస్తున్నారని
ఉదయాన్ని మంటల్లోకి విసురుతున్నా డింకొకడు
నేను మాత్రం మానవత్వపు విప్లవ కావ్యపుటల్ని
దానవత్వపు దారులలో పంచిపెడుతూనే వున్నాను,
కాంతిని ఒలుచుకుంటున్నా డొకడు
కాంతికే వలువలు నేస్తున్నాను నేను
నా పనులు సరికావనో
రక్తసిక్త హస్తాలు నాపై కొరిగాయి
మొండి హస్తాల కొనలతో
ఉదయ భాస్కరుని నొసట సింధూర తిలకము దిద్దుతున్నాను నేను
ప్రక్షాళను బంధించి
ఆవేశంతో రోటిలో దంచుతున్నా డొకడు
నలిగిన వానిని ఏరుకుంటూ
పదాలుగా మార్చుకుంటూ
కవితా రవ్వలు విరజిమ్ముతున్నాను నేను
నాకే మైందోగాని
చాలా ఆనందంగా వుంది నాకు
కళ్ళలోంచి జారిన అశ్రువులను
పెదిమలతో చప్పరించి దాహం తీర్చుకున్నాను నేను
ఆనందం
వ్యథలో చూచారా రెండు ఆనంద బాష్పాలు
సంతోషమే మరి
చేతలంటే మాటలా !
ఆనందమే మరి
సత్యంనుంచి, శివంనుంచి, సుందరంనుంచి.

o . o . o

# పంచాయతీ రాజ్యం

# ప్రజల రాజ్యం

బెల్లంకొండ చంద్రమౌళి శాస్త్రి

రామరాజ్యం—గ్రామరాజ్యం ఇది గాంధీజీ మన కోసం కన్న కమ్మని కల. దానిని పగటికల కానీయరాదు మనం.

మన క్షేమ లాభాలకు అడ్డంకిగా ఉండే పరాయి సర్కారు పోయి మనని మనం తీర్చి దిద్దుకోగలిగే స్వతంత్రం రావటం అన్నది అభ్యుదయ పథంలో ఒక మజిలీ అనవచ్చు. ఆ స్వాతంత్ర్యానికి సఫలత కలగాలంటే స్వపరిపాలనా, దానికి జీవనాడి ప్రజాస్వామ్యమూ తప్పక కావాలి. ఆ ప్రజాస్వామ్యమున్నూ ఎక్కడో ఒక వనం లాంటి భవనంలో చిక్కుబడి ఉండకుండా విశిష్ట వ్యవస్థా రూపంగా వికేంద్రీకృతం కావాలి. ఆ అవస్థాప్రతీకయే పంచాయతీ రాజ్యవ్యవస్థ. ఇదీ బాపూజీ రామరాజ్యానికి అర్థం. నిజానికి ఇదే ప్రజలు కోరే పరమార్థమున్నూ. అయితే ఇది సంప్రదాయబద్ధమా? విశ్వామిత్ర సృష్టా? అని కొందరి సందేహం! అంటే వీరి ఉద్దేశంలో పూర్వమున్నూ ఉన్నదైతే ఒక తృప్తి. క్రొత్త అయితే వద్దని కాదు. ఉత్తమాటలు కాకపోతే నవతకు ఆహ్వానం పలకడానికి ప్రజలు ఎప్పుడూ వెనుకాడరు జనగణమనాలు ఎప్పుడూ నిత్యనూతనతను అకాంక్షించటం అన్నదీ ఉన్నదే.

ప్రహతమైన దారి ఉంటే దాన్ని వదలరు జనం. కనుక కొంత వెనుక చూపున్నూ అవసరమేమో.

## పూర్వకాలంలో.........

అలాచూస్తే, గ్రామరాజ్య ప్రస్తావన అతి ప్రాచీన వాఙ్మయమైన ఋగ్వేదములోనూ, రామాయణ-భారతాలలోనూ, మనుస్మృతీ శుక్రనీతిసారం- కౌటిల్యుడి అర్థశాస్త్రం వంటి గ్రంథాలలోనూ ఉన్నది. కాని, నామమూ-రూపమూ కొంచెం భేదిస్తాయి.

చారిత్రికంగా కూడా శాతవాహనులనాడు పౌర వ్యవహారాలు ఎల్లవేళలా రాజుల ప్రభుత్వాల మీదే ఆధారపడి ఉన్నట్టు కనిపించదు.

ప్రజలంటే గొర్రెలమంద కాదు. వారికి తమ యోగక్షేమాలేవిటో తెలుసును. కనుకనే పౌరజీవిత విధానం బాగా వారి అంకిసాలో వుండేది.

ఇవి మత సంస్థాగతులైతే నిగమాలు, అనీ—పారిశ్రామిక పరమైనవాటిని సభలు అనీ, వాణిజ్య సంబంధాలు చూసేవి వర్తక సంఘాలు అనీ—చేతి పనుల వారికి 'సికాయాలు'అని ఇలా వుండేది ఆ స్థానిక స్వపరిపాలనం. వీటన్నింటికి పకడ్బందీ అయిన నిబంధనలూ-నిర్వహణా ఉండేవి. ఈ వివిధ సంఘాలకూ అధిపతిని శ్రేష్ఠి అనే వారట. ఇందులోనే ఇంకా చిత్రమైన సంగతి. ప్రజలు తమ మిగులుబడి ధనాన్ని ఆ సంఘాల్లో దాచిపెట్టడం—వారికి కావలసినప్పుడు అసలుఫాయిదాలతో సహా ఇవ్వటం అనేది అది. అంటే నేటి బ్యాంకింగు అన్నమాటేగదూ. ఇంకో విశేషం రాజునుసైతం ప్రజలే ఎన్నుకునే అధికారం కొన్ని ప్రాంతాలలో ఉండేదిట. ఈ వైనాలు ఋషభదత్తుడీ—రుద్రధాముడీ శాసనాలలోవి.

ప్రజలే రాజును తెస్తున్నారు. ప్రజలే ప్రభుత్వము చేస్తున్నారు. కాలానుగుణంగా వ్యవస్థ కొంత అటూ ఇటూ బెసగటం కద్దు. అయితేనేమీ ప్రజల స్వాతంత్ర్యాభిలాషలో మార్పులేదు. ఇది పాత కథేనని ప్రజ పారతంత్ర్యానికి ఓటు చేస్తుందా!!

## బందరు శాసనం

చాళుక్యుల హయాములోనూ గ్రామ పాలనా సభలు బలంగానే ఉన్నట్టు కొన్ని వివరాలు తెలుస్తున్నై. వారిలో రెండో భీమరాజునాటిమాట. విద్దమయ్య అని వేదశాస్త్ర నిష్ణాతుడైన ఒక బ్రాహ్మణుండేవాడుట.సరే ఆయన కొమాళ్ళు-మనుమలూ బాగా చదువుకున్న వారుండేవారట! వారు ఆనాటి 'వారగోష్ఠులు' అంటే మహాజనసభలలోనూ. 'పంచవార సభలు'—ఇవి నేటి పంచాయతీల్లాంటివట. వాటిలోనూ సభ్యులుగా కోరబడి ఉండేవారనీ—గౌరవ సభ్యులుగా నియమింపబడుతుండేవారనీ — జన్మకేదో మర్యాద లాంఛనాలు దొరికాయికదా అని పట్టుపీతాంబరాలు ధరించి అయిన దానికీ, కాని దానికీ తలూపుతూ, చేయెత్తమంటే కాలెత్తే గంగిరెద్దువలెగాక—ప్రజా సమస్యల మీద నిర్భీకంగా— ప్రావీణ్యంగా వాదిస్తుండేవారనీ— ఆరాజు బందరులో వేయించిన ఒక శాసనములో ఉన్నది.

అనంతరం కాకతీయుల కాలంలోనూ గ్రామాలలోనేమి పట్టణాలలోనేమి ప్రజల స్వంతపరిపాలన గురించి, వారు దేశాన్ని విశాలం చేసేయత్నాలలోనూ, విదేశీదండయాత్రలు ఎదుర్కొనే ప్రస్థానాలలోనూ ఉన్నాయి.

వారి నాటి ప్రజాప్రభుత్వం ఎంత నిష్ఠగా ఉండేదో తెలుసుకోవాలంటే ఓరుగల్లులోని వేశ్యావాటికలో "శారధర్మాసనం" అంటూఉండేదిట, వాటికి సంబంధించిన పేచీ పూచీలు అక్కడే అక్కడి పెద్దలతోనే పరిష్కరించేందుకు.

నాడు రమ శక్తికి ఎదురు లేదన్నంత ఎంతగొప్ప ప్రభువులైనా వారు జన వాక్యానికి విలువ ఇవ్వటం-పూర్వులు నడచిన జుణ్ణమైన బాటకు ఏమైనా ఉన్నపనిపిస్తే వంపులు తీరుస్తూ పోవడం చేసేవారని నాటికాలపు-నేటి కాలపు చరిత్రలు ఘోషిస్తున్నాయి

తరువాత తరువాత రెడ్డిరాజులూ - విజయనగర ప్రభువులూ ప్రజను నిర్లక్ష్యంచేసి గొప్పవాళ్లైనట్టు అవుపట్టంలేదు.

రెండో హరిహర రాయలకైతే ప్రజలు కొన్ని రకాల పన్నులు తమంత తామే ఇయ్యటానికి ముందుకు వచ్చినట్టు శాసన పరిశోధకులు చెబుతున్నారు.

ఇక అక్కడినించి ఎందువల్లనైతే నేమీ — గ్రహచారం చాలకే అనాలి! అన్యమత — అన్యదేశ్య పాలకుల వలలో చిక్కుకు పోయాం మనం.

అయినా, కుతుబ్‌షాహీలనాడు కొంత ఎక్కువగా-మొగలాయీలనాడు కొంత తక్కువగానే అయినా, మెచ్చుకుంటే మిరాశీలూ, అచ్చుకుంటే అగ్రహారాలూ అవీ ఇచ్చి, వాటికి నామక పన్నులు తాము తీసుకుంటూ మీది మీరే ఏలుకొండన్నారు. ఎవరో కర్కోటకుడు వచ్చినప్పుడు తప్ప సాధారణంగా పూర్వంనించీ వస్తూన్న జాగీర్లూ-మొఖాసాలూ అవీవారి పాలనకే వదిలేసి ఓకంట చూస్తూండేవారు. అంటిముట్టకు దిగజారింటి పంచాయతీ వ్యవస్థ అప్పటికి.

దాదాపు అప్పటిదాకా గ్రామాభివృద్ధికి. అది తాగే నీటికి బావే కానియ్యండి, పంట పండించేందుకు చెరువే కానియ్యండి, పశువుల మేతకు బీళ్లేమీ, చదువుకు బళ్లేమీ, తగాదాల పరిష్కారాలు, విజ్ఞానానికి పురాణాలు చెప్పించటమూ, వినోదానికి వీధి భాగోతాలూ తోలుబొమ్మలాటలూ వేయించటం, అరిష్ట నివారణకు గ్రామ జాతరలు చేయించటం, ఒకటేమిటి! సకలం గ్రామస్థులే చేసుకుండేవారు. ప్రభుత్వంకోసం ఎదురుచూస్తూ నిద్రతీస్తూండే వారుకాదు. ఈ నిర్ణయాలన్నీ గ్రామం నాలుగు బజార్ల కూడలిలో పోతుగడ్డమీద రావిచెట్టూ వేపచెట్టూ కలిసివున్న నీడలో కూర్చుని చేసేవారు. లేదా చిలోచెయ్యివేసి ఉమ్మడి స్థలంలో పాకో-ఇల్లో వేసి గ్రామసావిడీ అనేవారు. అక్కడే ఎవరైనా బాటసార్లుగాని, రాచరికంవారుగాని వస్తే ఉండే వసతి, గ్రామ పంచాయతీలూ నడిచేవి. వయస్సు మళ్లినవాడూ అబద్ధాలు అక్రమాలూ చెయ్యని వాడూ గ్రామపెద్ద. ఆయన ఇంకా నలుగురు ఇష్టులూ శిష్టులనూ పిల్చుకుని అందరి సమక్షంలోనూ మాట్లాడి అనాయాసంగా ఆలనా పాలనా చేసేవాడు.

ఇదంతా మన ఊహగాని అపోహ గాని కాదు. అందాజా 150 ఏళ్ళక్రితం బ్రిటిషువారి ఒక ఆక్టింగ్ గవర్నర్‌జనరల్ బ్రిటిష్ పార్లమెంటుకు తన నివేదికలో నివేదించుకున్నాడు మన పంచాయతీరాజ్య వ్యవస్థయొక్క గట్టి పునాదుల్ని గురించి.

వారు మనకోసం వచ్చినవారు కారుగనుక, ఈ మూలాన్ని ఛేదిస్తేగాని ఇక్కడ తమ అవిచ్ఛిన్నత సాగదని — దానిమీద గొడ్డలి పెట్టుగా మొట్టమొదలు 'లాండ్‌లార్డిజం' అనగా భూస్వామ్య పద్ధతి అంటే తమకు తాళం గొట్టేవారిని పెత్తందార్లుగా పెట్టి. వారిద్వారా తమ ఎత్తుగడలను సాధించుకున్నారు.

ఇట్లా ఏకులాగా తమ చేతుల్లోకి వచ్చిన వంతదార్లు కొందరు కొంతకాలం గడిచేసరికే మేకులా అయి వంకదార్లుపట్టటం అది 1857 ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో గ్రహించారు తెల్లవారు.

## బ్రతకనేర్చిన బ్రిటిష్‌వారు

ఏమైనా బ్రతకనేర్చినవారు గనుక తమ పంథాను కొంత మార్చేసి పట్నాలూ, జిల్లాలు, తాలూకాలుగా పరిపాలనా వికేంద్రీకరణ చేస్తున్నామంటూ. వాటికి మునిసిపాలిటీలూ, జిల్లాబోర్డులూ, తాలూకాబోర్డులూ-యూనియన్ బోర్డులూ అంటూ ఒక పద్ధతి తెచ్చారు. భూమిపన్నూ-నీటిపన్నూ తామే తీసుకుంటూ ఆ శిస్తు మీద రూపాయికి అణా అంటూ లోకల్ సెస్సులని వేసి ఆ డబ్బు ఈ బోర్డుల నిర్వహణకు కేటాయించా మన్నారు.

ఈ మాటలు వింటున్నప్పుడు ప్రజలకోసం - ప్రజలెన్నుకున్న - ప్రజా ప్రభుత్వం ఇదని అనుమానం కలక్కమానదు ఆ మాటల గారడిలో ! !

నిజానికి అవన్నీ బ్రిటిష్ ప్రభుత్వపు ఎడ్వర్టైజ్‌మెంటు బోర్డులే :

ఇక ఆ తెల్లవారికింద తెల్లమొహాలు వేసుకు బ్రతికే స్వదేశ సంస్థానాధిపతుల ఏలుబళ్ళలో ఇంతమాత్రమూ లేదు. వారు అచ్చం, ఖానా, పీనా, మజాకర్నా-ఆ ధోరణిలో వుండేవారు.

ఈ స్థితిగతులలో భారత రాజకీయ రంగంలో గాంధీ మహాత్ముడి ప్రవేశం అయింది. అప్పటినుండి గ్రామరాజ్య పునరుద్ధరణకు గట్టి కృషి మొదలైంది.

ఆయన ఇలా అన్నారు "ఎక్కడో కేంద్రంలో ఓ కొంతమంది పెద్దలు కూచుని సత్యమైన ప్రజాస్వామ్యాన్ని సాధించలేరు. నిజమైన ప్రజాస్వామ్యం అట్టడుగు నుంచీ, అనగా గ్రామ ప్రజలందరినించీ రావాలి" అని.

ఈ అభిప్రాయాలకు తోడి నాయకత్వం నుంచీ — ప్రజాబాహుళ్యంనించీ మాంచి మద్దతు దొరికింది

అందునా—ఇందునా—మనకు స్వరాజ్యం వచ్చాక మనం మనకోసం కట్టుకున్న రాజ్యాంగంలో 40వ ఆర్టికలులో గ్రామ పంచాయితీ స్థానాన్నిలా తీర్మానించారు. "గ్రామ పంచాయితీలు స్థాపించి, అవి స్వయంపాలనా వ్యవస్థలుగా పని చేసేందుకూ, వాటికి తగిన హోదానూ, అధికారాన్నీ కలిగించేందుకూ, రాష్ట్ర ప్రభుత్వాలు చర్యలు తీసుకోవాలి" అని.

రాజ్యాంగపు ఈ ఆదేశాన్ని చూపులో పెట్టుకునే ప్రథమ పంచవర్షీయ ప్రణాళికలో, కమ్యూనిటి డెవలప్‌మెంట్ స్కీం అంటూ ఒక కొత్త పుంత తొక్కి—అనుభవంలో అది గ్రామ పంచాయితీ వ్యవస్థకు దూరమైందిగా గ్రహించి—రెండో ఐదేండ్ల పథకంలో గ్రామంనించే దేశం నిర్మించబడాలనీ, తదనుగుణంగా ప్లాను ఇవ్వ

మని బల్వంతరాయ్ మెహతా అధ్యక్షుడుగా ఒక కమిటీ వేసింది కేంద్ర ప్రభుత్వం.

ఆ కమిటీ విచారణచేసిన పిదప ఇట్లా సిఫారసులు చేసింది. "పంచాయితీ రాజ్య వ్యవస్థ మూడు అంచెలుగా – అంటే – జిల్లా స్థాయిలో జిల్లా పరిషత్తులున్నూ, గ్రామ స్థాయిలో గ్రామ పంచాయతీలున్నూ. ఈ రెంటికీ మధ్య వైవిధ్యం వైషమ్యం రాకుండా అనుసంధానస్థాయిలో సుమారు ప్రతి వంద గ్రామాలూ ఒక బ్లాకుగా చేసి వాటిని పంచాయతీ సమితులుగానున్నూ చేయ్యాలనీ, ఇది జిల్లా స్థాయిలో వికేంద్రీకరణ అన్నీ. ఈ చర్యలు తీసుకొని వీటి బాధ్యతా నిర్వహణకు తగ్గ అధికారాలూ–ఆర్థిక వనరులూ ఏర్పరచాలనీ, అలాంటప్పుడే సమాజాభివృద్ధి కార్యక్రమానికి ప్రజల సహకారం లభిస్తుందనీ " అన్నవి ముఖ్యాంశాలు.

పై నుంచీ క్రిందికి వచ్చే పాలనా పద్ధతికి చెందిన సమాజ విస్తరణ కార్యక్రమాలు వైఫల్యం కారణంగా మెహతా కమిటీని వేయడం–దాని రిపోర్టు ఆధారంగా రాష్ట్రాలు పంచాయితీలకు ఒక చట్టబద్ధ రూపం ఇయ్యటమూ ఒక క్రమం.

## ప్రధాన భూమిక సమితిదే

ఈ పంచాయితీ రాజ్య వ్యవస్థలో ప్రధాన భూమిక సమితిదే అన్నట్టు దీనిని తొట్టతొలిసారిగా రాజస్థాన్‌లో 'నాగోర్' పంచాయతీ సమితికి 1959 అక్టోబరు 2, గాంధీ జయంతినాడూ, అదే సంవత్సరం నవంబరు 1వ తేదీ ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవమునాడు మన రాష్ట్రంలో మహబూబ్‌నగర్ జిల్లాలోని, షాద్ నగర్ పంచాయితీ సమితికీ అప్పటి మన ప్రధాని పండిత జవహర్ లాల్ నెహ్రూగారు ప్రారంభోత్సవాలు చేశారు.

మెహతాగారి కమిటీ సూచనలు 1959 డిసెంబరు 1 నుండి చట్టసమ్మతాకారం ధరించి అమలులోకి వచ్చినై.

వీటిని భారత దేశంలో ముందుగా దాఖలు పరచుకున్నది. రాజస్థాన్– ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలే. అయినా, మళ్ళా వీటిలో ప్రథమ తాంబూలం ఆంధ్ర ప్రదేశానిదే. ఈ వ్యవస్థ క్రమేపి, తతిమ్మా రాష్ట్రాలలోనూ కొన్ని–కొద్ది మార్పులు చేర్పులతో బైలుదేరింది. ఇంకా పూర్తిగా రూపం ధరించని ప్రదేశాలూ కొన్ని ఉన్నాయంటున్నారు. మనకు సంబంధించినంతవరకూ దాని ఆకార ప్రకారాలిలా వుంటాయి స్థూలంగా గ్రామ పంచాయితీ సభ్యులను నేరుగా ప్రజలే ఎన్నుకుంటారు. అ సభ్యులు పంచాయితీ సర్‌పంచ్ (అధ్యక్షుడు)నూ, వీరు పంచాయితీ సమితి ప్రెసిడెంటునూ. ఈ ప్రెసిడెంట్లు జిల్లా పరిషద్ ఛైర్మన్ (అధ్యక్షుడు)నూ ఎన్నుకుంటారు. ఇదీ వ్యవస్థా నిర్మాణం. దీన్ని నిర్వహణ దృష్టిలో చూస్తే ఈ చక్రంలో సమితే కీలక పాత్ర వహిస్తుందనాలి. ఎలాగంటే వివిధస్థాయీ సంఘాలద్వారా సమితి పరిపాలన యావత్తూ జరగటం అన్నది ఒక విశేషమూ–ప్రత్యేకత గదూ!

ఆ యా కార్యక్రమాలకు గాను ఏడుస్థాయీ సంఘాలుంటాయి. ఇవి సమాజాభివృద్ధి కార్యాలతోబాటు ప్రాథమిక విద్యా–చిన్న నీటి వనరులూ–బావుల సబ్సిడీలూ–సాంఘిక సంక్షేమమూ, సహజాభివృద్ధి, ఇల్లాంటి బాధ్యతలన్నీ పంచాయితీ సమితులకే ఇచ్చేశారు. కాగా జిల్లాపరిషత్తులకు రోడ్లూ, ఉన్నతవిద్యా ఈ రెంటి మీదే ప్రత్యేకాధికారం. జిల్లాస్థాయిలోని మిగతా కార్యక్రమాలన్నీ మళ్ళీ సమితులద్వారా జరగాల్సిందే పోతే గ్రామపంచాయతీల బాధ్యత లేమిటి? ఆ మాట కొస్తే ఇవి ఇవి అనీ, ఇన్ని అన్ని అనీ చెప్పటం కష్టమే. వారికి ఉన్న అధికారమూ లేదు. లేని బాధ్యతా లేదు. గ్రామానికి కావలసిన సకల సౌకర్యాలూ, సాంఘిక సంక్షేమమూ, అన్ని అభివృద్ధి కార్యక్రమాలునూ వీరివే. అయితే అభివృద్ధి పనుల విషయంలో మాత్రం పంచాయితీలు సమితులకు ఏజంట్లు అన్నట్టుగా వ్యవహరిస్తాయనుకుంటాను. ఈ పద్ధతికి రాజకీయభాష ఇట్లా వుంటుంది "మన దేశంలో ప్రజాస్వామిక ప్రభుత్వం ప్రజా ప్రతినిధుల పరిపాలనగా ప్రారంభమైంది. అది క్రమపరిణతి చెంది ఇప్పుడు గ్రామస్థాయిలోనూ ప్రజానీకానికి భాగ స్వామ్యందొరికే పంచాయితీ రాజ్యంగా మూర్తీభవించింది." అని–విప్లవాత్మకమైన ఈ క్రొత్తరకం ప్రజా స్వామ్యం చూసి పల్లె నుంచి ఢిల్లీదాకా అంతా అనుకున్నదీ ఆశించినదీ ఏమిటి?

గ్రామాలనించే దేశాన్ని తీర్చగల నాయకత్వం తయారు కావాలనీ, ఈ నాయకులే పరిపాలనా దక్షతా–లోకానుభవమూ–సాంకేతిక విజ్ఞాన పరిచయమూ సంపాదించుకుని జిల్లా, రాష్ట్ర స్థాయిలలోనేగాక యావద్భారత ప్రమాణంలోనూ సరైన నాయకత్వాన్ని సమకూర్చ గలరనీ, ఇట్లా సంఘటిత ప్రభుత్వ చక్రమంతా కూడా గ్రామాల చుట్టూ పరిభ్రమణం చేయడం గ్రామసీమలకు ప్రాధాన్యత వచ్చి సుఖసంపదలకు కొదవవుండదనీ, మహాత్ముడు గ్రామరాజ్యం–రామరాజ్యం అని పలవరించింది ఇదేననీ, ఏకొందరో గాదు అందరూ అనుకున్నారు.

గ్రామం పైకి లేవాలంటే, పట్టణం కొంత క్రిందికి దిగి రావాలి. పల్లెలతో పాటు పట్టణాలున్నూ ఈ కార్యక్రమావరణలోకి రాకపోతే సమాజవికాసం అనే మాటకు అర్థమే వుండదుమరి. అంటే పల్లెకీ నగరానికీ నడుమ ఉన్న దూరం కరిగిపోయి ఒక నవశక్తి ప్రాదుర్భావం అవుతున్నదని అందరూ గ్రహించాలి.

నిజానికి ఈ ధోరణిలో సమాజ వికాస కార్యాకర్మాక్రియలు కొంత క్రాంతి కలిగించాయనే అనాలి.

'ప్రభుత్వం' అనేమాట చోట 'పరిపాలన' అనీ 'రాజకీయం' స్థానంలో 'ప్రజాకీయం' అనీ పీట వేసుకున్నాయి. పట్నం నాగరికతకూ–గ్రామీణ సంస్కృతికీ సమయాను కూలవాక్యమైన ఈ మార్పులను ఎల్లరూ ధావళబుద్ధితో అవగాహన చేసుకోవాలి. ముఖ్యంగా గ్రామీణులు నడుంగట్టి పట్టుదలతో సాగిరావాలి.

అలా జరిగనినాడు అది ఎంత సబబైన కోరికే అన్నా, ఆశల సమూహమే అన్నా, అంతా ఒక్కసారే ఒళ్ళోకి ఒరుగుతుందని ఏవివేకి అనగలడు!

అయితే గడచిన మూడు పంచవర్ష ప్రణాళికల్లోనూ జనత ఆశించినంత సంతృప్తి కలిగిందా? అని; ఆ మాటకి దీని కోసమైన వ్యయ ప్రయాసలన్నీ వృథాయే అయినై అని అనబోవట

మున్నూ, సాహసమూ—సత్యదూరమే అయితే. సిద్ధాంతరాద్ధాంతాలెన్ని చేసినా ప్రజా—ప్రభుత్వమూ—అన్యోన్యాశ్రయతను ఇంకా గ్రహించినట్టు లేదంటారు కొందరు.

అంతేగాదు నిరుద్యోగనివారణ ప్రయత్నంగా ఉద్యోగి వర్గాన్ని పెంచుకుంటూ, వారికి ఒప్పచెప్పాల్సిన పనులేవో కల్పించుకుంటూ, పాతకాలపు రెడ్ టేపిజంతో పాటు క్రొత్త కార్యక్రమాలనే బ్లాక్ టేపిజంను ప్రజాసంస్థలనెత్తిన మోయలేని బరువుగా వేస్తున్నారనీ; పాలకులకు రాజకీయపు బెత్తులూ, జీతులు పారించేందుకైన తీరుబాటూ—ఆసక్తీ—ఇరవైయేండ్ల తర్వాత ఈ మున్నూ ప్రజలమే అన్న సంగతి మరిచిపోయిన తనమూ ప్రధానకారణాలుగా సామాన్య ప్రజలుకూడా తెలుసుకోగలుగుతున్నారంటే—ఒక విధంగా శుభదాయకమే ఒకానొకనాటికైనా.

ఇదినిజం. అందుకనే ఇది ప్రజలరాజ్యమా? పైళ్ళరాజ్యమా? అందరిరాజ్యమా? అధికారులరాజ్యమా? అన్నాడు ఒక బుద్ధిమంతుడు.

దీనికి తోడు ఈ వ్యవస్థవల్ల కలుగుతూన్న లాభాలూ—గౌరవాలూ ఇట్టే ఆకళించుకున్న ధనికులూ—పెద్దకులాలవారం అనుకుండేవారూ చాలా భాగం వీటిని తమ హస్తగతం చేసుకోవటమూ సామాన్యుడు ఆశించినదానికి ఆఘాతమైందనాలి.

ఇదంతాచూచి కొందరు చేసేదేమిటో ప్రభుత్వమే చేసెయ్యరాదా, ఈచిన్న చిన్న రాళ్ళ చిల్లర దేవుళ్ళ పెత్తనం ఎందుకు? అనిసున్నాలవన్నమే ఏకరువుబెట్టారు.

ఈ కథంతా కేంద్ర—రాష్ట్ర ప్రభుత్వాల చూపులో పడలేదనుకోవడం పొరపాటే అవుతుంది. దీనికేం జెయ్యాలా అని వారూ ఆలోచనలో పడ్డట్టు 1968 జూన్‌లో మద్రాసులో రాష్ట్రముఖ్యమంత్రులూ అలాగే, ఆయా రాష్ట్రాల పంచాయితీరాజ్య-సమాజవికాస సహకారశాఖలను చూస్తూన్న మంత్రులూ సమావేశం అయి, గ్రామాలలో ప్రజాస్వామ్యాన్ని బలపరచేందుకూ—సుసంఘటితమైన గ్రామీణ అభ్యున్నతిని సాధించేందుకు, పంచాయితీ రాజ్యకార్యక్రమాలకూ—సమాజవికాసకార్యాలకూ—కావలసిన మద్దతు నియ్యటంద్వారా పటిష్ఠంచేయాలని సిఫారసు చేశారు. వీటన్నిటినీబట్టి వ్యవస్థాపితంగా ఎంతో కొంత మార్పు తెస్తారనిఅనుకోవచ్చు. ఐనా, ఆ వచ్చే మార్పులవల్ల అనుకున్నంత క్షేమలాభాలు జరగబోవనీ అనుకోవచ్చును.

కాని, అనుమానపడుతున్నంత ప్రమాదం దీనిలో లేదేమో అనిపిస్తున్నది. ఏమంటే, ఈ వ్యవస్థకు సంబంధించిన సంస్థల దృక్పథాలలో మార్పువస్తేచాలు. అసలా మొదటిది ప్రభుత్వం. అది తన అభిప్రాయాలను చట్టంలో పెట్టేసి సెనగలు తిని చెయ్యి కడుక్కున్నట్టు అనాసక్తి యోగంలోపడకుండా. దాని ఆచరణకు దీక్షా—దక్షతాకనబరిస్తేనూ; రెండోస్థానం అధికారులది. వారు తమ పరంజేసిన బాధ్యతలనుంచీ నిర్లక్ష్యంగా తప్పుకోటంగానీ, ఏవేవో అభిప్రాయాలు కడుపులో పెట్టుకుని పనిచేయక పోవటంగానీ, రాజకీయ నాయకులూ—మిత్రులూ ఏదన్నాచెబితే అది మాత్రం చెయ్యటమూ—ఒక్కోసారైతే తమ రాజకీయాభిమతాలదృష్టితో ఎగనామంబెట్టటమూ; ఇట్లా ఎట్లా ఐతేనేమీ తమ ఉనికికిమూలమైన ప్రజను ఘాతరుచెయ్యకపోవటం నిత్యమూ చూడవలసిరావటం నిజంగానే దేశదౌర్భాగ్యం అనాలి.

ఎన్ని దీర్ఘోపన్యాసాలూ, ఎంత కట్టుదిట్టమైన చట్టాలూ, గొప్పమంత్రులూ—గొప్పగొప్ప నాయకులూ—ఎందరొచ్చినా, ఏమి చెప్పినా, అధికారులు తాము ప్రజలకంటే భిన్నులం కామనీ—తామూ ప్రజేననీ, అనుకోటం—చెయ్యటం—ఆదర్శం ఎట్లా వస్తుందో వస్తేనూ; మూడోది అనధికారులు. పంచాయతీరాజ్య వ్యవస్థలోవున్న తమాషా ఏమిటో అంటే అనధికారులకు అధికారాలు రావటం!!

## ఉదాసీనత పనికిరాదు

వారు ఈ చక్రం ఎలా త్రిప్పాలో కార్యాచరణ పరిధిఎంతో స్పష్టంగానిర్ణయం అవాలి ముందు. వారుతమ క్రిందిస్థాయిలవారిమీద పెత్తనంచేతామనుకోవటమూ—పై అంతస్థులవారి దగ్గర పలుకుబడి వినియోగింతామనుకోవటమూ—తమతమకు సంబంధించని ఇతర పరిపాలనా విషయాల్లో అపేక్షపెట్టుకునిపోతూ, తమకు సంబంధించిన పనులను సరీగ్గాచూడకా, చెయ్యకా—చెయ్యలేక పోతూండటమూ, మొదలైన అవ్యవస్థాదృష్టివిడనాడి—తమరు మినహా మిగతావారే ప్రజ అనే అపోహవిడనాడి, తమ శిరస్సు మీద ఉన్న గౌరవం ప్రజలదని తెల్సుకుని తమసుకృతంవల్ల తమకబ్బిన నాయకత్వానికి న్యాయంచేస్తూ విధాన నిర్ణయమూ మార్గదర్శకతా పర్యవేక్షణా ఇవన్నీ శ్రద్ధగాసుమండి, చేస్తేనూ కాగా, ఈ గొలుసులో మొదటినించి చివరిదాకా అంతాప్రజే. మళ్ళావారంతా ఎక్కువగా గ్రామీణులే, అందుకే ఎక్కువ మందిలో చదువుకోనితనమూ తాతలనాటి అలవాట్లు పెద్దలనుకుండేవారి మీద కళ్ళు మూసుకున్న విశ్వాసమూ ఇవి వారిగుడికట్టులోని పడికట్లు.

ఇంత అవస్థవున్న ఈ వ్యవస్థేమీ—దాని అనుబంధాలుగా ఉన్న సంస్థలేమీ సక్రమంగానూ—సమర్థంగానూ పనిచెయ్యాలంటే ప్రజలు మనదేముంది ఏదో ఎన్నుకోమన్నారు ఎన్నుకున్నాం. ఇక అంతా సర్కారేచేస్తుంది అనే ఉదాసీనతలో ఉన్నన్నాళ్లూ, పంచాయితీ అంటే తగూలు పెట్టుకుంటే తీర్చేది అని ఆమాత్రం చూపుతోనే ఓటుచేసినందుకైనా కనీసం అటుదిరిగి చూడక అలసభావంతో ఉన్నన్నాళ్లూ, ముక్తి లేదు—ఆఖరికి గ్రామ పంచాయితీ మట్టుకైనా ఏంజేస్తున్నారో—ఎందుకు చేస్తున్నారో— తెలుకోటమూ ఏమి—ఎందుకు—ఎలా—ఎప్పుడు చెయ్యాలో వారికి తెలియజెప్పి చేయించుకోటం తమహక్కని గుర్తించనన్నాళ్లూ మోక్షంలేదు అంటాను. అంతకు అవసరం పడితే పోరాటం సాగించటానికైనా వెనకాడక ప్రజలు శ్రద్ధాసక్తులు చూపిస్తేనే పంచాయితీరాజ్యం ప్రజాభోజ్యం అయ్యేది.

ఇంతమటుకు ఇదిమాటల్లో తేటగానే అవుపిస్తుంది. కాని ఈ జగన్నాథరథానికి నాలుగు చక్రాలూ సాఫీగా తిరిగిన నాడుగదా ముందుకుసాగేది. నిజమే. అయినా కొన్ని శుభసూచనలు కొనవస్తున్నై.

చూడండి, వందలకొద్దీ గ్రామాలలో పోటీలు లేకుండా ఎన్నికలు జరగటమూ. తక్కువగానే అయినా వెనకబడజాతులూ, హరిజనులూ, గిరిజనులూ, స్త్రీలూ సర్పంచులుగా రావటమూ. ఊళ్లల్లో సిల్‌సిలాగా వస్తూన్న మోతుబరులూ, విద్యావంతులూ, అగ్రకులాలు అనబడేవారూ కాకుండా, ఉత్సాహమూ—సేవా

(తరువాయి 27 వ పుటలో)




# 6

## తిరుగుబాటు

ఆ నాడు ఉలుఘ్‌ఖాన్ పట్టాభిషేకం. నాడు ఢిల్లీ అంతా మహోత్సవం చేసుకొంటున్నది. ఆ ఉత్సవంలో, మరణించిన సుల్తానును ప్రజలందరూ మరచిపోయారు. కొత్తగా సుల్తాను కానున్న ఉలుఘ్‌ఖానును గూర్చే చెప్పకొంటున్నారు.

నాడు ఢిల్లీకి బయట ప్రాంతాలలోనున్న మహమ్మదీయ మత గురువులు సుబేదార్లు, ఉమ్రావులు, సేనాధికారులు, ప్రధానోద్యోగులు అందరూ వచ్చారు. వారితోపాటు వేలాదిమంది ప్రజలు గూడ వచ్చారు. ఢిల్లీ ఎచ్చట జూచినా అలంకరణలతో వెలిగిపోతున్నది. పూలు, సువాసనలు, ఆనందోత్సవాలు, తన్మయత్వాలు ఇవే ఆ పట్టణంలో ఎచ్చట జూచినా కనబడుతున్నవి.

ఆ నాడు సుల్తాను కానున్న ఉలుఘ్‌ఖాను చాల సంతోషంగా వున్నాడు. అతని యానందాని కారోజు మేరలేకున్నది. అతడిక కొంత సేపటిలో భారత దేశానికి సుల్తాను కానున్నాడు. అంతకంటె భాగ్యం మరొకటేమున్నది ?

ఉలుఘ్‌ఖానుకు ముందు భారత దేశం మొత్తానికి సుల్తానయిన వారెవ్వరూలేరు అంతగొప్పవాడైన ఖిల్జీ గూడా, ఈ దేశాన్ని మొత్తంగా పరిపాలించలేక పోయాడు. కడకు తన తండ్రి గూడా ఈ దేశానికి సుల్తాను కాలేక పోయాడు. అతని అంతిమ దినాలలోనే దక్షిణాపథం తమ స్వాధీనానికి వచ్చింది. అది గూడా బలపరాక్రమాల వల్ల, తన ఎత్తుగడలవల్ల, తన కౌశలంవల్ల వచ్చింది. ఇప్పుడు తాను ఆర్యావర్తంతోపాటు ఆ ప్రాంతాన్నంతటినీ ఏలనున్నాడు.

దక్షిణాపథాన్ని జయించడం ఏంత కష్టసాధ్యమయింది! దేవగిరి ద్వారసముద్రాలు సులభంగా లోబడినప్పటికీ ఓరుగల్లు ఎన్ని కడగండ్లను గల్పించింది. కాకతీయ సేనలు, ఆ సేనానాయకులు, వారితోపాటు సంగ్రామరంగంలో తమ పరాక్రమాన్ని ప్రదర్శించిన నాయకులు తమ సేనలనెన్ని ముప్పతిప్పలు పెట్టారు! ఏకశిలానగరాన్ని వశం గావించుకొనడానికి ఎన్ని మార్లు దండెత్తవలసివచ్చింది ? ఎంత సైన్యాన్ని, ఎన్ని ఆయుధాలను, ఎంత ధనాన్ని నష్టపడవలసి వచ్చింది ? కడకు దేవగిరిరాజులు సాయపడకుండావుంటే, ఓరుగల్లు నగరాధ్యక్షుడైన కన్నయ్య నాయకుడు కుట్రజేసి ప్రతాప రుద్రుడు అతని సేనానాయకులు సమాలోచనలు గావిస్తున్న సమయంలో వారిని పట్టి యివ్వకుండా వుంటే తన పని ఏమయ్యేది ?

ఆ ప్రతాపరుద్రుడెంత ప్రతాపవంతుడు ? ఎంత ప్రతిభావంతుడు ? ఎంత ప్రజ్ఞాశాలి ? ఎంత పౌరుషవంతుడు. బంధితుడుగావుండిగూడా ఎంత హుందాగా వర్తించాడు ? అతడు చాలా గొప్పవాడు.

ఆ చక్రవర్తిని తీసుకొనివచ్చి ఢిల్లీలో ప్రదర్శించి ప్రతిష్ఠను పొందాలనుకొన్నాడు తాను. కాని అతడు తన కోరికను నెరవేరనివ్వలేదు. ఒకనాడు నర్మదానదిలో స్నానం చేస్తున్నాడు. ఏమయ్యాడో ఏమో ఎవరికీ తెలియదు. అందులోపడి మరణించాడో లేక తప్పుకొని పారిపోయాడో తెలియదు. ఆ విషయాన్ని గూర్చి ఎవ్వరూ చెప్పలేకున్నారు. తన భటులు ఏమయినారు? అందువల్ల చాల నష్టం వాటిల్లింది.

ఉలుఘ్‌ఖాను ఆలోచనలు ఓరుగల్లు మీదనే వున్నాయి. ఆయాలోచనలు అతనికున్న ఆనందాన్ని కొద్దిగా తగ్గిస్తున్నాయి.

మరలా ప్రతాపరుద్రుడు కనబడుతాడేమో, యుద్ధాని కుపక్రమిస్తాడేమో! మరొకసారి కాకతీయులతో యుద్ధం గావించవలసి వస్తుందేమో.

తన చారులు గూడా ప్రతాపరుద్రుడెక్కడో దాగివున్నాడనే అంటారు. ప్రజలింకా అతణ్ణి మరచిపోలేదని అంటారు. ఏనాడైనా అతడరుదెంచి తన పాలనం నుండి వారికి ముక్తి కలిగిస్తాడని వారింకా విశ్వసిస్తున్నారని అంటారు. తన ప్రభుత్వం మీద తిరుగుబాటుచేయడానికి ప్రజలే సహాయులవుతున్నారనిగూడా అంటారు. కాని ఆ తిరుగుబాటు స్వరూప స్వభావాలేమో తెలియజేయలేకున్నారు.

తన పట్టాభిషేక మవుతూనే ఒకసారి తాను దేశమంతా పర్యటన గావించాలి. ఎచ్చటెచ్చట తన రాజ్యం బలహీనంగా వుందో. ఏఏ ప్రదేశాలలో తన అధికార్లు అశక్తులుగావున్నారో కనుగొని అచ్చటి పరిస్థితుల్ని చక్కబరచి రావాలి. ముఖ్యంగా ఓరుగల్లుకు వెళ్లి అచటి స్థితిని మెరుగుపరచి రావాలి." అనుకొన్నాడు ఉలుఘ్ ఖాను

ఒకటి రెండు క్షణాలు అతని మనస్సు కలవరపడినప్పటికీ వెంటనే అది సంతోషంతో నిండుకొన్నది

పట్టాభిషేకానికి సమయం ఆసన్నమైనదని సేనానివచ్చి అతణ్ణి తీసుకొని వెళ్ళాడు. ఆ సమయంలో ఢిల్లీ అంతా ఎంతో కోలాహలంగావుంది.

అదే సమయంలో ప్రతాపరుద్రపురం గూడా చాలా కోలాహలంగావుంది. ఆ పట్టణంలో ఎచ్చట చూచినా వరాహధ్వజాలు ఎగురుతూవున్నాయి. పట్టణమంతా ఎంతో చక్కగా అలంకరింపబడివుంది.

ఆ పట్టణానికి వెలుపలనున్న పెద్ద మైదానంలో సేనలు బారులుతీరి వున్నాయి. సేనానులైన నాయకులచ్చటచ్చటా నిలబడివున్నారు. ప్రోలయ్య, కాపయ్య, వేమారెడ్డి సేనముందు నిలబడ్డారు. అన్నమంత్రి, కొలని రుద్రదేవుడు, రేచర్ల సింగమనాయకుడు వారి ముందు సైన్యానికభిముఖంగా నిలబడివున్నారు.

బారులు తీరివున్న ఆ సేనావాహిని, వారి ముందున్న ఆ సేనానాయకులు గంభీరంగా వున్నారు. వారిలో ఏదో ఆవేశం నిండుకొన్నది. వారు తమ నాయకులేమి చెబుతారో వినాలని ఎదురు చూస్తున్నారు. ఆ పట్టణానికి వచ్చిన ప్రజలు ఆ సైన్యాన్ని వలయాకారంలో చుట్టివేసి వున్నారు. వారు గూడా తమ నాయకుల ప్రబోధాన్ని వినడానికెంతో కుతూహలంగా వున్నారు.

"ఆంధ్రభూమండలాధ్యక్షుడైన ప్రోలయ్య నాయకుడిప్పుడు ప్రతిన చదువుతాడు, ప్రతివారూ ఆప్రతినను తీసుకోవలసి వుంటుంది.'' ప్రకటించాడు అన్నమంత్రి.

ప్రోలనీడు ముందుకువచ్చి పెద్దలకు నమస్కరించి సైన్యానికి అభిముఖంగా నిలబడ్డాడు. ఆనాడతడు వెలిగిపోతున్నాడు. అతని ముఖంమీద వీరావేశం చిందులు తొక్కుతూవున్నది.

ప్రోలనీడు ప్రతిన చదవనారంభించాడు. అచ్చట నున్న సైనికులు, సేనానాయకులేగాక, ప్రజానీకం గూడా ఆ ప్రతినను తీసుకోనారంభించారు. ఆ ప్రతిజ్ఞను తీసుకొంటున్నప్పుడచ్చట ఒక విధమైన గంభీర వాతావరణం నెలకొన్నది. అన్నివేల మంది. సైనికులు, అంతమంది ప్రజలు ప్రతినను పఠిస్తుంటే ఒకేఒక వ్యక్తి ప్రతిజ్ఞను గైకొన్నట్లుంది.

ప్రతిన పూర్తి అయింది

''జై ప్రతాపరుద్ర!'' అన్నాడు ప్రోలనీడు.

''జై ప్రతాపరుద్ర!'' అన్నారు సైనికులు, ప్రజలు. ఆ నినాదానికి ఆకాశం చిల్లులు పడినట్లయింది.

''జై ఆంధ్ర!'' అన్నాడు ప్రోలనీడు.

"జై ఆంధ్ర!" అనే నినాదంతో మరొకసారి దిక్కులు పిక్కటిల్లాయి.

ఆ తరువాత ప్రోలనీడిలా చెప్పసాగాడు. "వీర ఆంధ్ర యువకులారా! పౌరుషవంతులారా! ఈనాడు మన కగ్నిపరీక్ష. ఈ పరీక్షలో మనం జయించాలి. రక్తమోడ్చియైనా, ప్రాణాలర్పించియైనా ఆంధ్రావనిని విముక్తి చేయాలి. మరొకసారి కాకతీయ సామ్రాజ్యానికి రాజధానినగరమైన ఓరుగల్లుపై యీ వరాహధ్వజాన్ని ఎగురవేయాలి. అందుకోసం మీరందరూ సిద్ధంగా వుండాలి.

మీ రక్తానికి ఫలం యశస్సు.

మీ బలిదానానికి ప్రతిఫలం విజయలక్ష్మి.

మీరందరూ యీనాటి నుండే సంసిద్ధంగా వుండాలి. ఏనాడవసరమైతే ఆనాడు ముస్లిం సేనావాహినులపై పడడానికి ఆయత్తమై వుండాలి.

ఈనాడు మనం మన స్వాతంత్ర్యాన్ని ప్రకటిస్తున్నాము. ఈ స్వాతంత్ర్యం రాజమహేంద్రవరం నుండి అద్దంకివరకున్న తీర ఆంధ్రానికే గాదు. పూర్వ కాకతీయ సామ్రాజ్యానికంతటికీ వర్తిస్తుంది. ఇతర ప్రాంతాలవారిలో ఎవరు మనలో చేరినా వారిని కలుపుకొంటాము. ఎదిరించినవారిని తుత్తునియలు గావిస్తాము

తీరాంధ్రప్రాంతంలో నున్న వారందరూ ఇక మీదట ఢిల్లీ సుల్తానుకు కప్పం చెల్లించనవసరంలేదు. వారందరూ ఈ ఆంధ్ర రాజ్యానికే చెల్లించాలి. అలా చెల్లించనివారు దండించబడతారు. ఈ రాజ్యానికవిధేయులుగా ఎవరైనా వుంటేవారు శిక్షించబడుతారు. ఢిల్లీ సుల్తానుకు విధేయులుగా ఉండాలని, అతనికే శిస్తులు చెల్లించాలని ప్రజలను నిర్బంధించేవారు నాశనం గావింపబడుతారు. ఇది ఆంధ్ర భూమండలాధ్యక్షుడైన నాయాజ్ఞ. దీనిని ఈ ఆంధ్ర రాజ్యంలో విరివిగా ప్రకటించండి. ఈ యాజ్ఞల్ని పాలించండి. తిరుగుబాటు చేసినవారి తలలను తీయించండి.''

అన్నాడు ప్రోలనీడు

అతడామాటలంటుంటే ప్రతీవ్యక్తి హృదయం ఆవేశంతో పొంగిపొరలింది. వారి ప్రతినరం వుడుకెక్కింది. ఆ సమయంలో ఏమి చేయమన్నా చేయగల స్థితిలో వున్నారచ్చటనున్న వారందరూ.

ఢిల్లీలో పట్టాభిషేకం, ప్రతాపరుద్రనగరంలో స్వాతంత్ర్య ప్రకటన రెండూ ఏక కాలంలోనే జరిగాయి. రెండు పట్టణాలలోను ఉత్సవాలు, కోలాహలాలు, విందులు, వినోదాలు జరిగాయి. కాని అవి రెండు విభిన్న కోణాల్లో జరిగాయి.

ఆనాడు ఉలుఘ్‌ఖాను మహమ్మద్ బిన్ తుగ్లక్ ‌అయ్యాడు. ఆనాడే ప్రోలయ్య నాయకుడు ఆంధ్రమండలాధ్యక్షుడుగా గుర్తించ బడ్డాడు.

ఢిల్లీలో పట్టాభిషేకం జరుగుతూవున్నప్పుడే తుగ్లక్ రాజ్యములో కొంత విడిపోయింది. అతని అధికారాన్ని సవాలు చేయడానికి, అతణ్ణెదిరించి పోరాడడానికి సమాయత్తమయింది. కాని ఆ విషయం ఆ సుల్తానుకెన్నో దినాలకుగాని తెలియరాలేదు.

దేవగిరిలో సుల్తాను ప్రతినిధిగా నున్న వజీర్ మలిక్ అతని క్రింద పనిచేస్తున్న ఓరుగల్లు అధికారి ఢిల్లీనుండి తిరిగి వచ్చిన తరువాత తీరాంధ్ర ప్రాంతం తిరుగుబాటు గావించిందని సుల్తానుకు తెలిసింది. వేంటనే ఆ తిరుగుబాటు నణచివేయమని సుల్తాను వజీర్ మలిక్‌కు వర్తమాన మంపాడు.

సుల్తాను ఆజ్ఞననుసరించి వజీర్ మలిక్ దేవగిరి నుంచి ఆంధ్ర రాజ్యం మీదికి కొంత సేనను పంపాడు. ఓరుగల్లు నుండి మరికొంత సేనను పంపమని అచ్చట నున్న అధికారికి చెప్పి పంపాడు.

తమ తిరుగుబాటు ఢిల్లీ సుల్తానుకు తప్పనిసరిగా తెలుస్తుందని, వెంటనే అతడు తన సేనల్ని పంపుతాడని ప్రోలయ్య నాయకుడు తదితర ఆంధ్ర నాయకులు ముందే ఊహించారు. అందువల్ల వారు ముందుగానే ఆంధ్ర రాజ్యంలో వున్న ముస్లిం అధికారులను, సుల్తానుమీద పక్షపాతంతోవున్న హిందువులను బంధించివేశారు. ఎదురు తిరిగిన వారి తల తరిగించి వేశారు. కొన్ని దినాలలోనే ఆంధ్ర రాజ్యాన్ని నిష్కంటకం గావించి రానున్న దాడి కోసం ఎదురు చూడసాగారు.

సుల్తాను సేనలు దాడి జరిపినప్పుడు అవలంబించ వలసిన వ్యూహ విధానాన్ని గూడా వారపుడే ఆలోచించి వుంచుకొన్నారు. ఆ పద్ధతి ప్రకారం ప్రోలనీడొక సైన్య విభాగానికి, కాపయ్య నాయకుడు మరొక విభాగానికి నాయకత్వం వహించాలి. ఈ రెండు సైన్యాలు వేరు వేరుగా వుండి పోరాడాలి. దేవగిరి, ఓరుగల్లు సైన్యాలు సంధించకుండా చూడాలి. వేమారెడ్డి కొంత సైన్యాన్ని తీసుకొని వారికి తోడుపడుతూ వుండాలి.

ఆంధ్ర నాయకులనుకొన్నట్లే దేవగిరి సైన్యాలొక వైపు నుండి, ఓరుగల్లు సైన్యాలు మరొక వైపునుండి రాసాగినవి. ఓరుగల్లు నుండి వస్తున్న సైన్యాలు హెచ్చుగనుక ప్రోలయ్య నాయకుడు వాటినెదిరించడానికి వెళ్ళాడు. దేవగిరి సైన్యాలతో పోరడానికి కాపయ్య వెళ్లాడు. వేమారెడ్డి వారి వెనుకగా వెళ్ళాడు.

ఓరుగల్లు సైన్యాలు ఒక పర్వతశ్రేణి ప్రక్కకు వచ్చేసరికి ప్రోలయ్య సైన్యాలు వాటి మీదబడినవి. ఆంధ్ర సైన్యాలలా హఠాత్తుగా మీద బడుతాయని ముస్లిం సైన్యా లనుకోలేదు. ప్రమత్తంగా వున్న ఆ సైన్యాలు ఆంధ్రసైన్యాల తాకిడికి తట్టుకోలేక వెనక్కి తగ్గాయి. జై ప్రతాపరుద్ర!, జై ఆంధ్ర! అని నినాదాలు చేస్తూ ఆంధ్ర సైనికులు పైబడుతుంటే ముస్లిం సైనికులు వారి నెదిరించలేక పోయారు.

ఓరుగల్లు సైన్యాలకు నాయకత్వం వహిస్తున్న అబ్దుల్ రజాక్ ఆ ప్రమాదాన్ని గుర్తించాడు. ఆ విధంగానే పోరాడితే తమ కపజయం తథ్యమని అతను భావించాడు. అందువల్ల వెంటనే అతడు తన సైన్యాలను వెనక్కి తగ్గమని ఆజ్ఞాపించాడు. మైదానంలోకి వెళ్లి అచ్చట నుండి పోరాడుదామని అతడనుకొన్నాడు. అప్పుడు హెచ్చుగానున్న తన సైన్యాలకు తప్పనిసరిగా జయం చేకూరుతుందని అతని ఆశ.

కాని ఆంధ్ర సైన్యాలు అతనికా యవకాశాన్ని ఇవ్వలేదు. అవి వెనక్కి తగ్గుతున్న ముస్లిం సైనికులను తరుముకొంటూ ముందుకు వెళ్లాయి. అందువల్ల వెనక్కి వెళ్లడం కష్టసాధ్యమని తోచింది ముస్లిం సైన్యాలకు. ఆ ప్రమాదాన్ని అబ్దుల్ రజాక్ గూడా గుర్తించాడు. వెంటనే ముందుకు వెళ్ళమని సైన్యాల నాజ్ఞాపించాడు రజాక్.

ఇచ్చట ఈ విధంగా పోరు జరుగుతుంటే వాటికి సాయంగా దేవగిరి సైన్యాలు రాసాగినవి. వాటికి హిదయతుల్లా ఆధిపత్యం వహిస్తున్నాడు. రణకుశలు లైన సుల్తాన్ సేనానులలో అతడొకడు. అందువల్లనే వజీర్ మలిక్ అతణ్ణి పంపాడు ఆంధ్రరాజ్యం పైకి.

అంతేకాదు తిరుగుబాటు గావించిన ఆంధ్ర నాయకుల్ని తెగటార్చి, విడిపోయిన ఆంధ్ర రాజ్యాన్ని హస్తగతం గావించుకొని సుల్తాను ప్రశంసల నందుకోవాలని చాలా వేగంగా వస్తున్నాడు హిదయతుల్లా. ఓరుగల్లు సేనలకంటె ముందుగా వెళ్లి జయాన్ని సాధిద్దామని అతి వేగంగా వస్తున్నాడతడు.

దేవగిరి సేన ఒక అరణ్య ప్రాంతం వద్దకు వచ్చినప్పుడు, కాపయ్య నాయకుడచ్చట పొంచివుండి ఆ సైన్యంమీద తన సైన్యాన్ని నడిపించాడు. అది సాయం సమయం గనుక హఠాత్తుగా జరిగిన దాడికి వికావికలయింది దేవగిరి సేన.

ఈ మెరపు దాడులకు ముస్లిం సేనలలవాటు పడివుండలేదు.

మహమ్మదీయ సేనల్ని జయించాలంటే మెరుపు యుద్ధాలే చేయాలని, అలాటి యుద్ధాలే తప్పనిసరిగా విజయాన్ని చేకూర్చగలవని ప్రోలయ్య నాయకుని విశ్వాసం. కాకతీయ యుద్ధాలలో ముస్లిములతో నడిపిన పోరాటలలో పొందిన అనుభవమది. అందువల్ల ఆ నాయకుడు కొత్త యుద్ధతంత్ర పద్ధతిని కనిపెట్టాడు. దానిని సుల్తాను సైన్యాలకు వ్యతిరేకంగా ప్రయోగిస్తున్నాడు.

వికావికలైన సైన్యాన్ని కూర్చుకోవడానికి హిదయతుల్లాకు చాలా కష్టమయింది. కూర్చుకొన్నప్పటికీ వారినొక్కటిగా వుంచి యుద్ధం చేయడం దుర్లభ మనిపించిందతనికి.

కాపయ్య సైనికులు ఎదురుగానే గాక మధ్యలోగూడా దూరి గండి కొడుతున్నారు. వీరావేశంతో పోరాడుతున్నారు. అలాగా ఆవేశంతో పోరాడుతున్న సైనికుల్నెదిరించడానికి ముస్లిములకు వీలు కాలేదు. హిదయతుల్లా ఎంత ప్రోత్సహిస్తున్నప్పటికీ వారు ముందంజ వేయలేకున్నారు.

రానున్న ప్రమాదాన్ని గుర్తించాడు హిదయతుల్లా. వెంటనే ముందుకు వచ్చి కాపయ్య నాయకునిమీద బడ్డాడు. సేనానిని హడలు గొట్టగలిగితే జయించడం సులభమని హిదయతుల్లా అనుకొన్నాడు. కాని కాపయ్య ఖడ్గధాటిని రుచి చూచిన వెనువెంటనే తన అంచనా తప్పయిందని దిగులుపడ్డాడు.

కాపయ్య యువకుడు హిదయతుల్లా ఏబదేండ్లవాడు. ఎన్నో యుద్ధాలలో కాకలుతీరి వున్నప్పటికీ యువనాయకుడైన కావయ్య నెదిరించడాని కతనికి సాధ్యం కాలేదు. అతని ఖడ్గహతి నోర్చుకోగల శక్తి హిదయతుల్లాకు లేక పోయింది.

తనపై కురికిన హిదయతుల్లాను కొదమ సింగంలాగా ఎదిరించాడు కాపయ్య. దెబ్బకు దెబ్బ వేయడమేగాక పై దెబ్బలు గూడా వేశాడు. ఆ దెబ్బలకు హిదయతుల్లా తట్టుకోలేక పోయాడు. కోపంతో అతడు బలంకొద్దీ కాపయ్య శిరస్సుమీద కొట్టాడు ఖడ్గంతో. కాపయ్య అశ్వాన్ని ఉరాయించి ఆ దెబ్బను తప్పించుకొని వుండకపోతే అతని తల ఎగిరి పోవలసిందే. కాని ఆ నాయకుని తెలివి వల్ల ఆ ప్రమాదం తప్ప పోయింది. వెంటనే కాపయ్య తన అశ్వాన్ని హిదయతుల్లా మీదికి దూకించాడు. ఆ దెబ్బతో హిదయతుల్లా తూలి క్రింది కొరిగి పోయాడు. ఒరిగి పోతున్న ఆ సేనాని కంఠాన్ని రెండు ముక్కలు గావించాడు కాపయ్య.

హిదయతుల్లా క్రింద పడుతూనే ముస్లిం సేనలు పరుగులు కాసాగినవి. పరుగుపెడుతున్న మహ్మదీయ సైనికుల్ని వెంటాడమన్నాడు కాపయ్య. తమ నాయకుని ఆజ్ఞ ననుసరించి ఆంధ్ర సైనికులు మహమ్మదీయుల్ని వెన్నంటి చెండాడారు.

ఆ నాడు కాపయ్యకు ఘన విజయం చేకూరింది.

పర్వత శ్రేణి వద్ద పోరాడుతున్న ముస్లిం సైన్యాలు మొదట కొంత అయోమయ స్థితిలో పడినప్పటికీ కొద్ది కాలంలోనే సరుకొని ఆంధ్ర సైన్యాలతో పోరాడ సాగినవి. ఆ సైన్యాలు హెచ్చుగా వుండడం వల్ల ఆంధ్ర సైన్యాలకు వాటితో పోరడం కష్టమవుతున్నది. ప్రతి వారు విజయం సాధించే వుద్దేశంతో పోరుతున్నారు ప్రోలయ్య యమునిలాగా విజృంభించి పోరాడుతున్నప్పటికీ. విజయం కలుగుతుందనే ఆశ కనబడడం లేదు. ఆంధ్రసైనికులు ముస్లింసేనల ధాటికాగలేక వెనక్కి తగ్గుతున్నారు.

ఆ సమయంలో ఎచ్చటినుంచో జై ప్రతాపరుద్ర ! జై ఆంధ్ర! అనే కేకలు మిన్నుముట్టాయి. ఆ కేకలు వింటూనే ప్రోలయ్య సేనల ఉత్సాహం హెచ్చు పెరిగింది.

దేవగిరి సేనలకంటే ఓరుగల్లు సేనలే హెచ్చుగా వున్నాయని చారులవల్ల వేమారెడ్డికి తెలిసింది అందువల్ల వేమారెడ్డి ప్రోలయ్యకు సాయంగా వెళ్ళడమే మంచిదనుకున్నాడు. చారులను ముందు పంపి తాను తన సైన్యంతో వారి వెనకనే వెళ్ళాడు.

పర్వత శ్రేణివద్ద ఇరుసేనలు పోరాడుతున్నాయని, ఆంధ్రసైన్యాలు ముస్లిం సేనల ధాటికాగలేకున్నాయని వేమారెడ్డికి చారులు చెప్పారు. వెంటనే అతడు ఒక నిర్ణయానికి వచ్చాడు. ముస్లిం సేనల కెదురుపడి ఎదిరించడంవల్ల లాభంలేదు. అందువల్ల వెనుక నుండి ఎదిరిస్తే రెండువైపులా తగులుతున్న దెబ్బలకు తట్టుకోలేక ఆ సైన్యాలు లొంగిపోతాయని వేమారెడ్డి అభిప్రాయ పడ్డాడు. అందువల్ల అతడు అబ్దుల్ రజాక్ సేనల వెనుకకువెళ్ళి హటాత్తుగా వాటిమీద పడ్డాడు.

వేమారెడ్డిసేనలు వెనుకనుండి ఎదిరిస్తూనే ముస్లింసేనలు తికమకలైనాయి. ముందు ప్రోలయ్య. వెనుక వేమారెడ్డి.— ముందునుయ్యి. వెనుకగొయ్యి—ఏమిచేయాలో ముస్లింసేనలకు తెలియలేదు. అప్పటికే ఆసేనలలసిపోయి వున్నవి. అందులో చాలా భాగం నాశనమయివున్నవి. ఇప్పుడిరువైపులనుండి పోరాటం సంభవించింది. అందువల్ల అబ్దుల్ రజాక్ ఎంతగా ప్రోత్సహిస్తున్నా ఆ సైన్యాలు ఆంధ్రసైన్యాలకు లొంగిపోవలసివచ్చింది.

ఈ విధంగా ఆనాడు ఆంధ్రులు సుల్తాన్‌మీద ప్రథమ విజయాన్ని సాధించగలిగారు. (సశేషం)

---

# భూసంస్కరణల ద్వారా చిన్న రైతులకు లాభమే కాని నష్టం లేదు

---

# పల్లెసీమలకు ప్రతిబింబాలు
# కొండపల్లి బొమ్మలు

సి. వి. నరసింహారెడ్డి

అందమైన బొమ్మ ఆనందాన్ని కలిగిస్తుంది. బొమ్మలు కేవలం తమాషా కలిగించే వినోదసాధనాలే కావు; అవి మనకు ఎన్నో విధాల ఉపయోగపడుతవి. కొన్ని బొమ్మలు పిల్లల మనోవికాసానికి, వారి విద్యాబోధనకు విజ్ఞానాభివృద్ధికి ఉపకరిస్తే మరికొన్ని దేశచరిత్ర, సంస్కృతి, ప్రజల జీవన విధానాన్ని తెలిపేవిగా ఉంటవి. వినోద పర్యాటకులకు ముఖ్యంగా యాత్రికులకు బొమ్మలంటే ఒక సరదా. వారి యాత్రకు చిహ్నంగా స్థానిక ఆటబొమ్మలను తీసుకొనిపోవటం ఒక సంప్రదాయం. ఏ తీర్థానికి వెళ్లినా మనం ముఖ్యంగా పిల్లలకు బొమ్మలను కొనవలసిందే.

## బొమ్మల కొలువు

కొన్ని పండుగల సందర్భాలలో బొమ్మలకు చాలా ప్రాముఖ్యం లభిస్తుంది. ముఖ్యంగా దసరా, సంక్రాంతి పండుగలలో కన్నెపిల్లలు 'బొమ్మల కొలువు' పెడుతారు. ఇందులో అన్నిరకాల బొమ్మలుంటాయి. మూడు రోజులపాటు ప్రతిరోజు సాయంత్రం బొమ్మలకు హారతినిచ్చి, పేరంటాలు, వేడుకలు జరుపుకుంటారు. అందుచేత ఆటబొమ్మలకు ప్రాచీనకాలంనుండి మన భారతీయ సంస్కృతిలో ఒక ప్రత్యేక స్థానం ఉంది.

మన దేశంలోని ప్రతిరాష్ట్రం ఏదో ఒక తరహా బొమ్మల పరిశ్రమలో ప్రత్యేకస్థానాన్ని పొంది ఉంది. ఆదేవిధంగా కొండపల్లి కొయ్యబొమ్మలు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం యొక్క ప్రత్యేకతను ప్రకటిస్తవి.

ఇవి భారతదేశంలోనేకాదు; ఇతర దేశాలలో కూడా మంచి పేరు పొందినవి. విదేశీయులు కొండపల్లి బొమ్మలంటే చాలా ఆసక్తి చూపుతారు. ముఖ్యంగా ఇంగ్లాండు, అమెరికా, ఆస్ట్రేలియా దేశాలలో యీ బొమ్మలకు గిరాకి ఎక్కువ.

## చారిత్రిక విశేషాలు

కొండపల్లి చారిత్రిక ప్రాముఖ్యంగల గ్రామం. ఇది విజయవాడకు సుమారు 16 కిలోమీటర్ల దూరాన ఉంది. కొండవీటి రెడ్డి రాజవంశ స్థాపకుడు కోమటి ప్రోలయ వేమారెడ్డి క్రీ.శ. 1360 సంవత్సరంలో కొండపల్లి కొండపై ఒక అభేద్యమైన కోటను నిర్మించాడు. ప్రస్తుతం శిథిలావస్థలోనున్న యీ కోట ఒకప్పుడు యీప్రాంతానికి రాజధానిగా ఉండి అనేక పోరాటాలకు కేంద్రమై చరిత్రాత్మక ప్రదేశంగా అలరారింది. క్రీ.శ. 1516 సంవత్సరంలో



కృష్ణదేవరాయలు, 1531 సంవత్సరంలో గోల్కొండ నవాబు ఖులీఖుతుబ్‌షా, 1687 సంవత్సరంలో మొగలు ప్రభువు ఔరంగజేబు మొదలగువారు యీకోటను ఆక్రమించుకున్నట్లు తగిన చరిత్రాధారాలు కలవు. ఆ తరువాత క్రీ.శ. 1766 సంవత్సరంలో జనరల్ క్యాలాడ్ బ్రిటిష్ ప్రభుత్వం కొరకై నిజాం నవాబు నుండి యీ గ్రామాన్ని తీసుకున్నాడు.

చరిత్ర ప్రసిద్ధి గాంచిన కొండపల్లి నేడు కొయ్యబొమ్మలకు పేరుపొందిన గ్రామం. ఇంత వైశిష్ట్యం కలిగిన యీ గ్రామీణ కళ ఇక్కడ ఎప్పుడు ఏ విధంగా ప్రారంభమయినదో ఖచ్చితంగా చెప్పడానికి తగిన ఆధారాలు మాత్రం లేవు. అయితే కొండపల్లి బొమ్మల పరిశ్రమకు 4 వందల సంవత్సరాల చరిత్ర ఉందనీ క్రీ.శ. 16 వ శతాబ్దంలో రాజస్థాన్‌లోని ఆర్యక్షత్రియులు అక్కడి క్లిష్ట పరిస్థితులను భరించలేక కొండపల్లి ప్రాంతానికి తరలివచ్చి

తమజీవనాధారానికై బొమ్మల పరిశ్రమను ప్రారంభించినట్లు కొందరు స్థానికులు అంటారు. వీరు మంచి మంచి బొమ్మలను చేస్తూ ఆ రోజుల్లో ప్రజల మన్ననలను కూడా పొందారు. ఇప్పటికి కూడా ఆర్యక్షత్రియ తెగకు చెందినవారే యీ వృత్తిలో వున్నారు.

కొండపల్లిలో బొమ్మల పరిశ్రమ అభివృద్ధి కావడానికి యిచ్చట లభించే కొయ్య ముఖ్య కారణం. ఈ ప్రాంతంలోని అడవులలో తేలికపాటి సున్నితమైన పుణికి కర్ర విస్తారంగా లభిస్తుంది. నాణ్యమైన పనితనానికి యీ కర్ర చాలా ఉపయోగ పడుతుంది. దానితో ఎటువంటి బొమ్మలనైనా చేయవచ్చు.

కొండపల్లి కొయ్య బొమ్మలు గ్రామీణ జీవితానికి ప్రతిబింబాలు. నిజంగా యివి పల్లెజీవితాన్నీ పల్లెప్రజల ప్రవృత్తులను కండ్లకు కట్టినట్లుగా వివిధ రూపాల్లో మనకు ప్రస్ఫుటం చేస్తవి. ఒక విదేశీయుడు కొండపల్లి బొమ్మల ఒక నమూనా సెట్టును చూస్తే అతనికి మన పల్లెజీవితం అద్దంలోచూసినట్లు అర్థమవుతుంది. ఈ లాంటి నమూనా బొమ్మల సెట్టులో గ్రామాల్లో సాధారణంగా మనకు కనిపించే ఒక తాటాకుల గుడిసె దానిముందు ఆవు పాలు పితుకుతున్న దృశ్యం, రైతు పశువులతో పొలాలకు వెళ్లేబొమ్మలు, స్త్రీలు బావినుండి నీరుతెచ్చేవి, గొల్లకాపరి గొర్రెలను కొట్టేదృశ్యాలు, ఎడ్లబండి మొదలగు బొమ్మలు ఉంటవి. అదేవిధంగా వృత్తులను ప్రదర్శించే సెట్లలో గ్రామీణులకు చెందిన 21 వృత్తులను తెలిపే బొమ్మలుంటాయి. అందులో ముఖ్యంగా రైతు, కమ్మరి, గౌడ, కల్లుగీత మొదలగునవి పేర్కొనదగినవి. పౌరాణికరూపాలు, దేవతల అవతారాలు, పశువులు, పక్షులు, కూడా బొమ్మల రూపంలో చిత్రించబడుతాయి. వీటిలో అందరిలో వున్న ఏనుగు, జాతీయపక్షి నెమలి చాలా పేరుపొందినవి. పౌరాణికరూపాలలో, గోపికలతో శ్రీకృష్ణలీలలు, దశావతారాలు ప్రధానమైనవి. దశావతారాలకు సంబంధించిన బొమ్మలు కొండపల్లి బొమ్మల పరిశ్రమకు మంచి పేరుప్రతిష్ఠలు తెచ్చినవి. కొన్ని బొమ్మలలో హాస్యం కూడా తొణికిసలాడుతుంది.

## బొమ్మలుచేసే విధానం

కొండపల్లి బొమ్మల తయారీ విచిత్రంగా ఉంటుంది. చూడడానికి ముద్దుగా, యింపుగా, విచిత్రంగా ఆనందకరముగా ఉంటుంది. తయారయిన బొమ్మలు చూస్తుంటే అవి మౌన భాషతో మనతో మాట్లాడుతున్నట్లు కనిపిస్తాయి. వీటికి అవసరమున్న ముడిపదార్థాలలో తెల్లపుణికి కర్ర, చింత గింజలు, జిగురు, రంగులు, తళుకు రేకులు, తెల్లబట్ట, మేకులు ముఖ్యమైనవి. యివన్నీ స్థానికంగా లభించే ముడిపదార్థాలు. బొమ్మలను తయారుచేసే పనిముట్లు గ్రామంలో సులభంగా లభిస్తాయి.

అడవులలో లభించిన పుణికి కర్రను తెచ్చి అవసరమైన సైజులలో చెక్కించి నీడలో ఆరబెట్టుతారు. ఆ తరువాత బొమ్మల సైజునుబట్టి పెద్ద కర్రలను, చిన్న చిన్న ముక్కలుగా కోయడం జరుగుతుంది. ఈ ముక్కలలో ఏమాత్రం నెమ్ములేకుండా చేయడానికిగాను రంపపు పొట్టు సెగమీద వీటిని పెట్టుతారు. ఆకురాయితో ముక్కలను నునుపు కూడా చేస్తారు. సాధారణంగా మూడు అంగుళాల నుండి 12 అంగుళాల పొడవుగల బొమ్మలను తయారుచేస్తారు. కొన్ని పెద్దవిగా కూడా ఉంటవి. వీటి ధరలు 2 రూపాయల నుండి 150 రూపాయల వరకు వుంటవి.

కొండపల్లి బొమ్మకు అంతిమ రూపం వచ్చేవరకు మూడు దశలుగా మారుతుంది; ఈ మూడు దశల తరువాతనే బొమ్మ చక్కని రూపంలో మన చేతికి వస్తుంది. మొదటి దశలో చూచాయగా బొమ్మయొక్క పటం వేయబడుతుంది. రెండవ దశలో పటం ఆధారంగా బొమ్మయొక్క ఆకారాన్ని కళాత్మకంగా కొయ్య ముక్కపై చెక్కుతారు. ప్రధాన అంగాలైన కాళ్లు, చేతులు, చెవులు, ముక్కు, వ్రేళ్లు మొదలగునవి ప్రత్యేకంగా మలచబడుతాయి. వీటిని చింతగింజతో చేయబడిన జిగురుతో బొమ్మకు అతుకుతారు. ఆ తరువాత సున్నపు జిగురు కోటింగు వేసి ఆరబెడతారు. చివరి దశ చాలా ముఖ్యమైనది. మూడవ అంతిమ దశలో కుంచెలో రకరకాల రంగులువేసి బొమ్మలకు తుది మెరుగులు దిద్దుతారు. అప్పుడు అందమైన బొమ్మ మన చేతికి



వస్తుంది. బొమ్మలు తయారుచేసే పని సాధారణంగా కళాకారులు ఎవరింటిలో వారే చేసుకుంటారు. కుటుంబ సభ్యులందరూ యీ వృత్తిలో పాల్గొనడం ఒక ప్రత్యేకత. చిన్న పిల్లలు కర్రను తెస్తే పెద్దలు మంచి నైపుణ్యంతో బొమ్మలను మలచి చెక్కి వాటికి రూపురేఖలనిస్తారు. స్త్రీలు రంగులువేయడంలో సహాయ పడతారు.

## ఇతర కేంద్రాలు

కొండపల్లితోపాటు, మన రాష్ట్రంలో ఆదిలాబాదు జిల్లాలోని నిర్మల్, విశాఖ జిల్లాలోని ఏటికొప్పాక, చిత్తూరు జిల్లాలోని తిరుపతి బొమ్మల పరిశ్రమకు చాలా ప్రధానమైన కేంద్రాలు.

నిర్మల్‌లో సహజమైన చెక్కు చెదరని రంగులతో జంతువులు పక్షులు, పండ్లు, కూరగాయలు నమూనాలను బొమ్మల రూపంలో తయారు చేస్తారు. నిర్మల్ అడవి ప్రాంతం కాబట్టి అడవుల ప్రభావం అక్కడి బొమ్మలలో అగుపడుతుంది.

ఏటికొప్పాక గ్రామం లక్కపిడత బొమ్మలకు చాలా ప్రసిద్ధి చెందినది. ఎద్దులు, రైలు ఇంజన్లు విమానాలు, లేంపుస్టాండ్లు ఆష్‌ట్రేలు మొదలగు నమూనా బొమ్మలు లక్క రంగులతో కంటికి యింపుగా ఉండేటట్టు చేస్తారు.

తిరుపతి పరమ పవిత్ర క్షేత్రం. ఈ దేవాలయ ప్రభావం యిక్కడి బొమ్మలమీద కూడా పడింది. ఇక్కడ లభించే ఎర్ర చందనపు కర్రతో పౌరాణిక విగ్రహాలు, మానవవృత్తుల నమూనా బొమ్మలు తయారుచేస్తారు. తిరుపతి బొమ్మలు స్వాభావికంగా కర్రతో వచ్చిన రంగుతోనే వుంటాయి. బొమ్మలరంగు మారదు. ఇది యిక్కడి ప్రత్యేకత.

చేతి పరిశ్రమలు అనేకమందికి జీవనోపాధి కలిగించడమే గాకుండా, విదేశీ మారకం సంపాదించుకొనుటకు యితోధికంగా తోడ్పడుతవి. రాష్ట్ర ప్రభుత్వం యీ చేతి పరిశ్రమాభివృద్ధికి అన్నివిధాలా సహాయపడుతున్నది. కొండపల్లి బొమ్మల పరిశ్రమ సహకార సంఘం 70 మంది సభ్యులతో ప్రారంభించబడింది. ఈ సంఘానికి ప్రభుత్వం మూల ధనంగా 17 వేల రూపాయలు మంజూరు చేసింది. సభ్యులకు అవసరమున్న ముడిసరకులు, ఋణాలు సరఫరా చేయడంతోపాటు వారు తయారుచేసిన బొమ్మలను తీసుకొని విక్రయ సౌకర్యాలు కలిగిస్తున్నది. పని వారలు ఒకే చోట బొమ్మలుచేయు సౌకర్యం కలిగించేందుకుగాను ఒక సమిష్టి సదుపాయ కేంద్రం కూడా యీ గ్రామంలో స్థాపించబడింది. యంత్రపు పనిముట్లు, ఇతర సాంకేతిక సహాయం యీ కేంద్రంలో లభిస్తవి. దీనికి 25 వేల రూపాయలు ఖర్చుచేయబడింది. ప్రతి సంవత్సరం 70 వేల రూపాయలు విలువచేసే బొమ్మలను కొండపల్లిలో తయారుచేస్తారు.

---

## పంచాయతీ రాజ్యం

( 20 పుట నుండి )

భావమూ గల సామాన్య సంసారులు ఇందులోకి దూకటమూ ఇదంతా ప్రజాపరంగా క్రిందినించి పైకి సాగే సమాజాభ్యుదయంగానే భావించాలి.

పోతే ఏకగ్రీవంగా ఎన్నికలు జరుపుకున్న పంచాయతీలకూ పంచాయతీ సమితులకూ బహుమతులియ్యటమూ, నూటికినూరుపాళ్లు తమ పన్నులు వసూలు చేసుకున్న గ్రామపంచాయతీలకు మేచింగ్ గ్రాంట్సు అని ఇయ్యటమూ, నిర్దేశికాంశాలలో అధిక ఫలితాలు సాధించిన ఉత్తమ పంచాయతీలకూ సమితులకూ ప్రత్యేక బహుమానాలు యియ్యటమూ చేసి ప్రజలలో ఉత్సాహాన్ని ఉరకలెత్తించటమూ–ఇదంతా ప్రభుత్వ పరంగా పైనుంచి క్రిందికి దిగివచ్చే శుభ పరంపరగా అనుకోవాలి. ఇందులో ఇంకొకటి, స్వపరిపాలనానుభవంలేని పంచాయతీల సమితుల అధ్యక్షులకు స్థానిక పాలనా శిక్షణనిప్పించి సమర్థులుగా చేసే ఉద్దేశంతో మచిలీపట్నం, కడప, వైరా, బోధన్ లలో శిక్షణా కేంద్రాలు తెరచారు. ఇది చాలా ముఖ్యమైనదనాలి.

ఆ శ్రేణిలోనే కొన్ని ఈయేడు కేంద్రప్రభుత్వం గ్రామీణ మంచినీటి, పథకం మాతా శిశు ఆరోగ్యాభివృద్ధి పథకం గ్రామాలలో ఉద్యోగావకాశాల విస్తృతికి ప్రత్యేక కార్యక్రమాలూ సౌకర్యాలూ చూసేస్తానూ. ఇవన్నీ రాష్ట్రాలనే చేపట్టమని, వాటికయ్యే ఖర్చులు తామేర్పాటు చేస్తామని ఢిల్లీనుంచి ఒక శుభసందేశం. వీటిని పంచాయతీలు అందిపుచ్చుకున్నట్టు తిన్నగా అమలు చేసుకుంటే చాలు, వ్యయభారం ఎలాగూ లేదుగనక రాష్ట్రాలు కొంచెం ఆసక్తితో ఒకకన్ను దీనిమీదవేస్తే చాలు: గాంధీ గారన్న రామరాజ్యం–మనమనే గ్రామరాజ్యంగా తీరి జనతా సార్వభౌమతా విలసితం అవుతుంది.

ఇప్పుడు చెప్పిన అన్ని సంగతుల వివరాలలోకి పోతేనూ–వ్యవధి అంతంత మాత్రమై వదలిన విషయాలన్నీ ఏకరువు పెట్టాలంటేనూ–ఈ పంచాయతీరాజ్య వ్యవస్థాగతమైన నియమనిబంధనలూ, వంకలూ, అంకెలు చూపాలంటేనూ మరోసారి కావాలి మనకు

కారణం–అదే ప్రభుత్వం అనిపించుకుండే హుందా హోదా గలది పంచాయతీ రాజ్యం గనక.

ఇది ఎక్కడో కొండమీది కోతిలా కాక జీవగడ్డలైన మన ప్రతి గ్రామగ్రామానా మనకోసం మనలోపుట్టి నునదే ఇది అనుకుండేది గాబట్టి, ప్రగతి శీలమైన జీవనజగత్తులో అవసరాలూ, అవకాశాలూ, అన్నీ ఇన్నీ అనడానికి వల్లగాదు కావునసూ. ★

---



# బొమ్మల

'ఆటబొమ్మలలో భారత దేశం''—అనే పథకం క్రింద తయారవుతున్న ''భారత దేశపు వధువులు" అనే బొమ్మలు

చైనా (తైవాన్) కు చెందిన బొమ్మలు



నాటిక

# సమ్మె ఎందుకు?

పుప్పాల చలపతిరావు

## మొదటి రంగం

[తెరలేచే సరికి] పర్ణశాల మాదిరి యతీంద్రుని గది. గదిలో ఒక ప్రక్కన టేబులు, దానిమీద ఖద్దరు గుడ్డ, కొన్ని పుస్తకాలు వార్తాపత్రికలు, కొన్ని ఫైల్సు కాగితములు. బల్లకు వీలుగా, రెండు కుర్చీలు. డాక్టరు చేతులు వెనక పెట్టుకొని అటూ ఇటు తిరుగుతూంటాడు వకీలు క్రింద నిలబడి ఒక కాలు కుర్చీమీద పెట్టి గెడ్డం క్రింద చెయ్యి పెట్టుకొని దీర్ఘంగా ఆలోచిస్తూంటాడు. కొద్ది క్షణాల తరువాత యతీంద్రుని ప్రార్థనా గీతం, వారితో పాటు శిష్యులు, శిష్యురాండ్ర కంఠాలు వినిపిస్తాయి ఈ ఇద్దరు నిశ్చల భక్తితో ఎక్కడ ఉన్నవారు అక్కడే నిలబడి పోతారు.

ఓం తత్సత్ శ్రీనారాయణతూ
　　పురుషోత్తమ–గురుతూ
సిద్ధ బుద్ధతూ–స్కంధ వినాయక
　　సవితా పావకతూ
బ్రహ్మమజ్దతు–యహ్వశక్తితు
　　ఏసుపితా–ప్రభుతూ
రుద్రవిష్ణుతు–రామకృష్ణతు
　　రహీం తావోతు
వాసుదేవగో–విశ్వరూపతూ
　　చిదానంద హరితూ
అద్వితీయతు–అకాల నిర్భయ
　　ఆత్మలింగ శివతూ...ఓం

(శంఖారావం, గణ గణ గంటలు మ్రోగుతూంటాయి ఇద్దరు ఆశ్రమంలోపలికి వెళ్ళి కొద్ది క్షణాల్లో యతీంద్రునితో సహా తిరిగి వస్తారు.)

యతీంద్రుడు:— డాక్టరుగారూ!

డాక్టరు:— (ఒక్క అడుగు ముందుకువేసి కొద్ది దూరంలో యతీంద్రునికి ఒక ప్రక్కగా నిలబడతాడు)

యతీంద్రుడు:— భారత దేశంలో హింసాత్మక విప్లవాన్ని సృష్టించడము మాత్రము అసాధ్యమైన విషయము. వ్యక్తిగతంగా ఎవరైనా అట్టి విప్లవాన్ని సృష్టించే శక్తిని కలిగి ఉన్నామని పొరపాటున భ్రమిస్తూఉంటే— అంత కంటె అతీతమైన అహింసాశక్తి భారత ప్రజలలో ఉందని మాత్రం మరచిపోకండి పార్టీల ప్రాబల్యం కోసము ప్రాణాలు తీయడం, తుపాకులు పేల్చడం సహజమనుకునే ఏపార్టీ కూడా కలకాలము ఉండదు అట్టి తుపాకులకు, కత్తులకు, భారతీయులు రిక్త హస్తాలతో తమ తమ గుండెలను చాచి ముందుకు వచ్చి ఎదురు నిలుస్తారు. ఇటువంటి తత్వంతో కూడినది భారతీయుల విప్లవం. అర్థమయిందా డాక్టరుగారూ! ఈ రాకెట్ల యుగంలో భయం ఆవహించిన ప్రతి మానవునికి శరణ్యం ఒక్క భారతీయ సిద్ధాంతమే అని మరచిపోకండి దేశమంటే ఉదాత్తమైన అభిప్రాయాలున్నా దేశంకోసం ఆగ్రహం తెచ్చుకోకండి. దేశంకోసం చావడం ఒక్కటే తెలుసు—బ్రతకడం కూడా నేర్చుకోవాలి. ఇదేమాదిరి హక్కుల కోసము సమ్మెచేయడమే కాదు, ఉత్పత్తి పెంచడం కూడా నేర్చుకోవాలి.

డాక్టరు:— ఇపుడు సమ్మెచేయించడం అంత మంచిది కాదనేగా మీ అభిప్రాయం?

యతీ:—అవును

వకీలు:—ఎందుకు మంచిది కాదు?

యతీ:—దానివల్ల లాభమేమిటి వకీలు గారూ?

వకీలు:—అహింసా విధానముతో కూడిన శాంతి యుతమైన సమ్మె కూడా నష్టాలకు దారితీస్తుందంటారా?

యతీ:—నష్టాలకు దారి తీయదని ఎలా ఊహించగలుగుతున్నారు?

వకీలు:— నడిపించే నాయకత్వాన్ని బట్టి ఆ ఫలితాలుంటాయి.

డాక్టరు:—ఆ ఫలితాలు కూడా ఒక్కొక్క సారి పులివిస్తళ్ళలాగ ఎగిరిపోతాయి. అప్పుడు మీరేంచేస్తారు?

వకీలు:— మరో ప్లాను వేసి కుంటుపడకుండా మరింత బలవత్తరంగా నడిపిస్తాము.

డాక్టరు:— సరే— అలా ఎంతకాలము?

వకీలు:— జర్గినంతకాలము—అని అంటానని అనుకుంటున్నారా? అది కాదు హక్కులు సిద్ధించేవరకును.

డాక్టరు:—హక్కులు సిద్ధించటము సంగతి ఎలావున్నా మాటి మాటికి ప్లానులు మారుస్తుండడము వలన నాయకత్వము దెబ్బతింటుంది. పచ్చికుండలో నీళ్ళుపోద్దాం తరువాత విచ్చిపోయేటట్టు కనుపించే సమయంలో మరో మార్గం ఆలోచిద్దాం అనుకోవడం లాంటిది.

వకీలు:— రాజకీయాలు అనేవి ఎప్పుడూ పచ్చికుండలో నీళ్ళుపోసిన తదుపరి పరిశీలనలో మునగడము—తేలడము అలవాటేగా డాక్టరుగారూ.

డాక్టరు:— అటువంటి భావాలతో కూడిన నాయకత్వం తరతరాలు ఉండదు. కుక్కగొడుగుల ఆయుష్షు కూడా ఒక ఆయుష్షేనా

నాయకత్వాల వ్యామోహంలో రాజకీయాలను, పరిస్థితులను మార్చడము, మార్చుకోవడం అలవాటుగా చేసుకున్న పార్టీలలో ప్రజలు మాత్రం సుఖ పడలేరు. ముఖ్యముగా కార్మికుల కసలే సౌఖ్యంవుండదు. అందుకనే సిద్ధాంతాలు నిర్మించే ముందు ఆలోచించి స్థిరమైనది స్థాపించాలి. అలాంటి వాటి గురించే సదా ఆలోచిస్తూ ఉండాలి.

(ఒగుర్చుకుంటూ జగ్గు ప్రవేశం. జేబులోనుండి మడత పెట్టిన కరపత్రిన్నిరసి వకీలుకు ఇస్తాడు. వకీలుమనసులో చదువుకుంటాడు)

జగ్గు: ఆ కర పత్రిన్ని రాత్రికి రాత్రే పంచి పెట్టేశారు వకీలు గారూ!

(వకీలు జగ్గు దగ్గరికి వెళ్ళి అతని చెవిలో ఏదోచెపుతాడు. జగ్గు వచ్చిన దారినే నిష్క్రమిస్తాడు)

వకీలు:- డాక్టరుగారూ! ఇప్పుడర్థమయిందా? అందుకే ముందుగానే మనం మేలుకోవాలని మొదటనుండి వాదిస్తూంటే మీరే మన్నారు? సమ్మె అనే మాటను ఎత్తవద్దన్నారు. ఈ అవకాశాన్ని ఇతర పార్టీల వాళ్ళు వినియోగించు కున్నారు. ఇప్పుడు కార్మికుల దృష్టి వాళ్ళ వేపు మొగ్గింది.

డాక్టరు:- ఇపుడు మన కర్తవ్యం ?

వకీలు:- సమ్మె భగ్నం చేయడానికి ఇపుడు కుట్ర అవసరం.

యతీంద్రుడు:- (కోపంగా, విసుగ్గా) కుట్రలు-కుట్రలూ-కుట్రలు ఒకటే కుట్రలు. మానవుని మనస్సంతా మానవ శ్రేయస్సు పైనే కేంద్రీకరించాలయ్యా!

వకీలు:- హూ! యతీంద్రా! రాజకీయాల జీర్ణకోశమే కుట్ర. ఆ కుట్రనే లేకపోతే రాజ్యములేదు. ఐక్యమూలేదు. చైతన్యం అంతకంటే లేదు.

యతీం:- కుట్రలు, గృహదహనాలు, దోపిడీలు, హత్యలు సమాజంలో మానవునికి నిత్యకృత్యంగా తయారయి నపుడు అట్టి విధానాన్ని బద్దలు చేయడంకోసం, నీ మేధాశక్తి నంతటిని ఉపయోగించు. కాని-నేడు మన మాతృదేశము పచ్చగా పెరుగుతోంది. చిన్నచిన్న విషయాలను ఆధారంగా తీసుకొని సమ్మెలు, తిరుగుబాట్లు, కుట్రలు గురించి ఎందుకాలోచిస్తారు. కుట్రలనే పదములోవుండే బరువు మెంతో మీ నేత్రాలు చూపిస్తాయి. ఇప్పుడు మీ నేత్రాలు బరువుగాను, ఎర్రగాను చేసుకోకండి. ఉషోదయంలో గంగా స్నాన మాచరించి వస్తూన్న మహర్షి నేత్రాల్లాగ, హృదయంలాగ తేజోమయంగా తయారు చేసుకోండి.

డాక్టరు:- ఇపుడు సమ్మె చేయడం మంచిది కాదని కార్మికులకు తెలియజేసే విధానం ఏమిటి యతీంద్రా ?

వకీలు:- రేపు సాయంత్రమే బహిరంగ సభ ఏర్పాటు చేద్దాం.

డాక్టరు:- అదే మంచి పద్ధతి.

జగ్గు:- (పరుగెత్తుకొనివచ్చి యతీంద్రునితో) కార్మికులంతా బ్రహ్మాండమైన ఊరేగింపు లేవదీశారు. పనిమీద ఒక్కడు కూడా లేడు. ఆఖరికి కార్మిక స్త్రీలనుకూడ రెచ్చగొట్టేరు స్వామీ! అంతేకాదు, భయంకరమైన నినాదాలుకూడ వారిచేత చేయిస్తున్నారు.

యతీంద్రుడు:- సమ్మెబలం కోసం భయంకర నినాదాలతో కార్మికులను ఎలా ఉద్రేక పరుస్తున్నారో చూశారా ?

డాక్టరు:- సమయం చూసి నాయకులు సమ్మెను ప్రారంభించారు. నిన్ననేగా బోనసు అందింది. ఈ కొద్ది ఆర్థిక బలాన్ని చూసుకొని కార్మికులు కూడా నాయకుల మాటల్లోపడి దోష పూరితులయ్యారు.

వకీలు:- అది వారి తప్పేమీకాదు. సమ్మెనాయకుల ఎత్తుగడలోని గొప్పతనం.

డాక్టరు:- ఈ సమ్మె ఉద్రేకంలో మనం బహిరంగ సభ ఏర్పాటు చేస్తే కలిగే ఫలితం ?

వకీలు:- (కొద్ది క్షణాలు నిశ్శబ్దంగా తలగోక్కుంటూ ఆలోచనలో మునిగి పోతాడు.

యతీంద్రుడు:- తమ కుటుంబాల భవిష్యత్తును ఆలోచించుకోలేని ఉద్రేకంలో మునిగి వున్నారు కార్మికులు. మనం వెళ్ళి దేశము, సౌభాగ్యము అంటే ఇప్పుడు వాళ్ళకేమి అర్థమవుతుంది?

వకీలు:- సమ్మెలో ఇరుక్కుపోయిన కార్మికుల సంగతి ఏంచేద్దామంటారు?

యతీంద్రుడు:- ఇది దీర్ఘకాల సమ్మెగా పరిణమిస్తే ముందు ముందు కార్మికులలో అరాజకము, విపరీతమైన అశాంతి ప్రబలిపోతుంది. అలా జరక్కుండా మనం చేతనయినంత వరకు కార్మిక కుటుంబాల రక్షణకొరకు ఆహార వైద్య సదుపాయాలు ఏర్పాటు చేస్తూండాలి. ఈ విధంగా శాంతిని ఎప్పుడైతే ప్రజల్లో ప్రవేశపెట్టుతుంటామో అప్పుడు ఇటు ప్రజలు, అటు కార్మికులు మన నిజాన్ని మన దృక్పథాన్ని దృష్టికి తెచ్చుకోగలుగుతారు.

వకీలు:- మేనేజ్‌మెంటును మనం కలుసుకొని ఒకసారి మాట్లాడితే?

డాక్టరు:- ఏ విషయంలో ?

వకీలు:- కార్మికులకు, యాజమాన్యానికి మధ్యవచ్చిన నిజమైన మనస్పర్ధలను అర్థం చేసుకోవడానికి.

యతీం:- ఈ మనస్పర్ధలు వైషమ్యాలు, విషమ పరిస్థితులు అనేవి కార్మికులకు యాజమాన్యంలో భాగస్వామ్యం వచ్చే వరకు ఉంటూనే ఉంటాయి. కనుక యాజమాన్యంలో కార్మికునకు భాగస్వామ్యం రావాలనే నినాదాన్ని స్థిరపరచాలి. అంతేకాదు ఈ సిద్ధాంతాన్ని ప్రభుత్వ దృష్టికి, ఇటు

కార్మికుల దృష్టికి అతి త్వరలో తీసుకురావలసి ఉంటుంది వకీలుగారూ ?

(లోపలినుండి శ్రావ్యంగా చర్చిగంటలను పోలిన గంటలు వినిపిస్తూంటాయి.

యతీంద్రుడు. ఆశ్రమ విద్యార్థులందరూ నా కోసం ఎదురుచూసే వేళయింది. ఇకశలవు ఇప్పించండి (నిష్క్రమిస్తూండగా తెరపడుతుంది )

## రెండవ రంగము

కార్మికునిగది. దండెముమీద మాసినగుడ్డలు వేలాడుతూ ఉంటాయి. తలదగ్గర మాసిపోయి పిగిలిపోయిన గుడ్డగల పడక కుర్చీవాల్చి ఒక ప్రక్కగా ఉంటుంది. మరోప్రక్క కుక్కినులుక మంచములో 70 ఏండ్ల వృద్ధుడు పరుండి ఉంటాడు. పక్షవాత రోగంతో కుడికాలు కుడిచెయ్యి పనిచేయదు. దగ్గుతూ, మూలుగుతూంటాడు. మరోమూల వంటకు సంబంధించిన రెండు మూడు మట్టి దాకలు ఒక అన్నంకుండ, సీమవెండి చెంబు పాత బడిన ఇత్తడిగ్లాసు, మసిబారి పగిలిన చిమ్మనిగల ఒక లాంతరు చిందరవందరగా పడి ఉంటాయి. 10 సంవత్సరముల రమణి మాసిపోయి చినిగిపోయిన గౌనుతో చింపిరి తలతో నీరసంగా అడుగులు వేసుకుంటూ వచ్చి అన్నంకుండ చూస్తుంది. వరుసగా మిగిలిన దాకలు చూచి నిరుత్సాహంగా కుర్చీలోకూలబడి క్షణంసేపు కాళ్ళు ముడుచుకొని తరువాత ఒక ప్రక్కగా ఒరిగి పరుంటుంది. తిరిగిలేచి, గ్లాసుతో నీళ్ళుతాగి పడక కుర్చీలో యథాప్రకారం పడుకుంటుంది.

వృద్ధుడు :—(ధర్మయ్య) దగ్గుతూ లేవబోతూంటాడు. (ఇలా రెండు సార్లు ప్రయత్నించి) రమణమ్మా ! (దగ్గు) ఏమ్ రమణమ్మా (కొంచము గట్టిగా) నిన్నేనే ! (దగ్గుతో ఉక్కిరి బిక్కిరి అవుతాడు.) అమ్మా ! రమణీ కొద్దిగా మంచి నీళ్ళు యియ్యవే

రమణి :—(నీరసంగాలేచి మౌనంగా నీళ్ళగ్లాసు అందిస్తుంది. ధర్మయ్య ఎడమ చేతితో పట్టుకొని వొణుకుతూ త్రాగుతాడు ఇంతలో గ్లాసుజారి ఒళ్ళో పడిపోతుంది. నిస్సహాయుడై రమణి ముఖంలోకి జాలిగా చూస్తూంటాడు. ఆ గ్లాసును రమణి తీసి ఆ మంచం క్రిందనే పెడుతుంది.)

ధర్మయ్య :—(దగ్గు తెరలు తెరలుగా వస్తూంది. రమణి అక్కడ నుండి కుర్చీదగ్గరకు వెళ్ళిపోతుండగా ఆయాస పడుతూ.) నాయన రాలేదా ?

రమణి :—(చిరాకుగా రాలేదు. (కుర్చీలో మరోప్రక్కగా తిరిగి కాళ్ళు ముడుచుకొని పరుంటుంది )

ధర్మయ్య :—మీ అమ్మ ?

రమణి :—ఏమో !

ధర్మయ్య :—మ్రింగడానికి – మందులేదు. తినడానికి – తిండిలేదు. బ్రతకడానికి ఓపికలేదు చావడానికి ధైర్యములేదు ఏమిటీ బీదవాళ్ళ బ్రతుకులు?

రమణి :—(పడుకున్నదల్లా లేచివచ్చి, మంచందగ్గర నిలబడి) మొన్న తెలుగు దవాఖాన డాక్టరుగారు ఏమన్నారో తెలుసా ? " లంఖణం పరమౌషధమట." అందుకని సంవత్సరానికోసారి యిలాంటి పెద్దపెద్ద సమ్మెలు వస్తూంటే బీదాళ్ళకి ఏ రోగాలూ రావట తాతయ్యా !

ధర్మయ్య : నిజమే—సమ్మె సర్వరోగ నివారిణి అందరి రోగాలూ ఒక్కసారే తగ్గుతాయి.

రమణి :—నీరోగంకూడా ఈ దెబ్బతో తగ్గిపోద్దా తాతయ్యా ?

ధర్మయ్య :—యీ సమ్మెనాయకులకు రోగాలు తగ్గితేనే గాని (దగ్గు) మలేరియా జ్వరంలాగ—ఈ సమ్మెజ్వరం సంఘాన్ని పట్టుకొని కుదిపేస్తున్నది.

రమణి :—మరి మందు ఎవరికియ్యాలి తాతయ్యా ?

ధర్మయ్య :—నాయకులకు తల్లీ—నాయకులకు. ఇంతవరకు సరైన మందుపడక అప్పుడప్పుడు, ఆ సమ్మెజ్వరం వాళ్ళని తిరగ దోడుతుంది.

రమణి :—(మంచం పట్టెమీద కూర్చుంటూ) అంటే ముందు ఈ జ్వరం నాయకులకు వస్తుందన్నమాట ?

ధర్మయ్య :—అయ్యో పిచ్చితల్లీ ! నాయకులకురాదు. వాళ్ళు బల వంతంగా ఈ సమ్మె జ్వరాన్ని వాళ్ళ తలకాయలోకి ముందు ఎక్కించుకుంటారు. అది బాగా వాళ్ళకి ఒంట బట్టిన తరువాత, ప్రజల తలకాయల్లోకి ఎక్కిస్తారన్న మాట.

రమణి :—అయితే యిది తలకాయలకువచ్చే రోగమన్నమాట ! (ధర్మయ్య నవ్వబోతాడు ఇంతలో దగ్గు తెరలు తెరలుగా వచ్చి బాధపడిపోతాడు. రమణివచ్చి ధర్మయ్యను మంచం మీద పరుండబెట్టబోతుంది దగ్గుతూనే ఉండమని చేతితో సౌంజ్ఞచేసి, దగ్గు పూర్తి అయిన తరువాత, తనచెయ్యి రమణికి వూతగా యిస్తాడు. నెమ్మదిగా రమణి ధర్మయ్యను పరుండబెడుతుంది. లక్ష్మి మాసిన చీర జాకెట్టుతో, చింపిరి తలతో ఏడుస్తున్న చంటిపిల్లవాడిని భుజంమీద వేసుకుని, ఓదార్చుతూ రంగం మీదకు వస్తుంది).

లక్ష్మి :—ఏడవకునాన్నా ......ఏడవకు (ఓదార్చుతూ ఇటూ అటూ తిరుగుతూంటుంది. వాడు ఎంతకూ వూరుకోడు. వీపుమీద కోపంకొద్దీ రెండు చరుస్తుంది. దండెంమీదనుండి ఒక దుప్పటితీసి, కుర్చీ ప్రక్క క్రింద పడేసి ఆ గుడ్డను కాలితో సరిజేసి పిల్లాడిని అక్కడ కోపంగా పడుకోబెట్టి, ఆ ప్రక్కనే కుర్చీకి ప్రక్కగా కూలబడి కుర్చీకి ఆనుకొని కళ్ళనీళ్లు పమిట చెంగుతో తుడుచుకూంటూంది. రమణి పిల్లవాడిని ఎత్తుకొని ఓదారుస్తూ నిష్క్రమిస్తుంది.

ధర్మయ్య :—రామిగాడు యెక్కడికెళ్ళేడు ?

లక్ష్మి :—ఏమో మామయ్యా—ఎవర్ని ఏమీ అనేటట్టులేదు. చావ లేక బ్రతుకుతున్నాం-బ్రతకలేక చస్తున్నాం!

ధర్మయ్య :—ఆ చావైనా పూర్తిగా రావటంలేదు.

లక్ష్మి :—సహం చచ్చిన నల్లుల్లాగా బ్రతుకుతున్నాం. (రామిగాడు తలగుడ్డ చుట్టుకుంటూ లచ్చీ, లచ్చీ అని పిలుస్తూ ప్రవేశం)

లక్ష్మి :—యింకా చావలేదు—బ్రతికేవున్నాను.

రామయ్య :—అంతకోపం దేనికే ?

లక్ష్మి :—చూడులేకపోతే, ఎంతటి వాళ్ళకైనా కోపంవస్తుంది. మీకు కోపంవచ్చేగా—మీరంతా సమ్మెచేస్తున్నారు

రామయ్య :—మేం బైట చేస్తూంటే నువ్వు ఇంట్లో చేస్తూన్నావన్న మాట ?

లక్ష్మి :—నేను ప్రత్యేకంగా చెయ్యక్కర్లేదు. అందర్నీ అదే చేయిస్తుంది

రామయ్య :—అదే-అంటే ?

లక్ష్మి :—మీరు తొక్కుతున్నదారి, ఆ పాడుదారి అందర్నీ మాడ్చి ఎండబెడుతూన్న మాయదారి. చివరకు గోదావరేగతి కట్టుకున్న పెళ్ళాం బిడ్డలకీని.

రామయ్య:— ఏమిటేలచ్చీ ఆమాటలు ?

లక్ష్మి:— కాకపోతే యేమిటిదంతాను !( మంచం వైపు చూపిస్తూ కోపంగా) మీ నాయన చూస్తే పక్షవాతంతో కదలేకవుంటే, యింత మందు చుక్కలు తెచ్చిపోసే గతి లేకపోయే—సరి గదా—గుక్కెడు"టీ నీళ్ళు కాసి పోద్దామంటే గతి లేకపోయె! పిల్లకు పాలు లేక గుక్క పట్టిఒకటే ఏడుపు—పెద్దపిల్లవచ్చి మంచినీళ్ళు త్రాగి, పైత్యంతో కళ్ళు తిరిగిపడి పోవడమా? సమ్మె అనిచెప్పి పనికిపోవడం మాను కున్నారు. ఇంట్లో ఒక్క బియ్యపు గింజ లేకుండా ఎంత కాలము మీరు ఈ సమ్మె నడుపుతారు? ఏమోబాబు-కన్నతల్లి ఏ బాధనైనా భరించగలదు గాని, కన్నబిడ్డల ఆకలిని, ఏడ్పును మాత్రము చూచి భరించలేదు (అంటూ కళ్ళుతుడుచు కుంటుంది.)

చంద్రం:— ( చుట్ట కాల్చుకుంటూ ప్రవేశం )

రామయ్య: రా చంద్రన్నా !

చంద్రం:— యిలా యెంత కాలంరా తమ్ముడూ యీసమ్మె.

రామయ్య:— (ఉద్రేకంగా) యెంత కాలమైనా సరే—పెళ్లాం బిడ్డలు చచ్చినా సరే—మనం చచ్చినా సరే. అంతా చచ్చినా సరే...

చంద్రం.— అంతా చస్తే యింకేముందిరా?

లక్ష్మి:— (హేళనగా) విజయం! బ్రహ్మాండమైన విజయం!

చంద్రం:— ఇప్పుడు నేనెందుకొచ్చేనో తెలుసా ?

రామయ్య:— చెప్పు?

చంద్రం:— మనం పనిలోకి దిగి పోదాం.

రామయ్య:— మన మంతా సమ్మె ప్రారంభించేముందు శపథంచేసి, వీరకంకణం కట్టుకున్నాం. మరిచేవా?

లక్ష్మి:—కొద్దిరోజుల్లోనే మరణ కంకణం కట్టుకోవచ్చు.

చంద్రం:— అందుకనే కదమ్మా—మీ ఆయన దగ్గరకొచ్చింది. మీ ఆయన్ని కూడా, ఒక నాయకుడిగా అందరు కలసి ఎన్ను కున్నారు. ఏ మంచి చెడలొచ్చినా వారితో చెప్పాలిగా మరి. తిండిలేక అందరూ ఎండిపోయి, తోటకూర కాడల్లాగ వాలి పోయేరు. ఉన్న మంచం, చెంబు, గ్లాసుతోసహా తాకట్టు పెట్టు కున్నారు. ఇక—ఆఖరికి అమ్ముదామంటే కుండలు తప్ప యింకేమీ కనుపించడంలేదు. చారెడు గింజలు పుట్టే మార్గములేక మరీ యీవారం రోజుల నుండి మలమల మాడి పోతూన్నారు. యీసమ్మె చూస్తే యెప్పటికి అంతమయ్యేదీ అర్థం కావడం లేదు. యీబాధలకు తోడు అందరికి అన్ని రకాల రోగాలు పట్టుకున్నాయి. తిండి లేక సంభవించిన ఈ రోగాలకు, పళ్ళు, పాలు, పంచదార తినమని డాక్టర్లు సలహాలిస్తున్నారు. యతీంద్రుని ఆశ్రమం వారు మాత్రం ఎంతని సహాయం చేయగల్గుతారు?

లక్ష్మి:— నాశనం చేసే నాయకత్వాలు ఎక్కువవ్వడం వల్లనే, మాగతే మీకు పట్టిందన్న మాట?

రామయ్య:— నీవు కాస్సేపు నోరు మూసుకుంటావ్?

ధర్మయ్య:— నీ చేత గాని తనానికి దాన్నెందుకురా ఆడిపోసు కుంటావు? అది ఆడదైనా—చదువుకున్నది గనుక ఆమాత్రం జ్ఞానమన్నా ఏడ్చింది. నీవు చదువు లేని నాయకుడవయ్యావు గనుక ఆలోచించడానికి నీ మెదడు చాలటంలేదు.

రామయ్య:—(కోపంగా.)సమ్మె నడుపుతున్న పెద్దనాయకులకు కూడా చదువు లేదంటావు, మెదడు లేదంటావు! అంతేగా

ధర్మయ్య:— మెదడుండి లాభమేమిటిరా ? ఎద్దుకు లేదూ ? చదవగా సరా ? పార్టీల పలుకు బడికోసం, స్వప్రయోజనాలకోసం మోసపు మాటలుచెప్పి ప్రజల్ని సమ్మెల్లోకి దింపడం కూడా ఒక ఘన కార్యమేనంటావా ?

చంద్రం:— ఒరేయ్—తమ్ముడూ— రామయ్యా. కార్మిక శక్తి ఆకలి పరీక్షకు తట్టుకోలేదు. సరిగదా ఆశక్తే ఊరి మీద పడితే తుడుచుకు పోతుంది.

రామయ్య:— నీ వనుకున్న నీచానికి ఆశక్తి దిగదు చంద్రన్నా.

చంద్రం:— పరిస్థితులే దింపుతాయి. నీవూ, నేను కాదంటే ఆపగలమా

లక్ష్మి: సమ్మె చెయ్యండి, చెయ్యండి అని వాళ్ళ ప్రాణాలు తీసి చేయించారు. ఇప్పుడది బాగా బిగిసి కూర్చుంది. "కరవమంటే కప్పకు కోపం, విడవమంటే పాము క్కోపం" అన్నట్టు తయారయింది.

(వీధి గుమ్మంలో కోలాహలం చాలా మంది కార్మికులు బైటనుండి రామయ్యను పిలుస్తారు రామయ్య గుమ్మం వేపు చూసేటప్పటికి నలుగురు కార్మికులు రామయ్యకి కొంచెం దూరంలో కుడివేపు ఇద్దరు. యెడమవేపు ఇద్దరు కార్మికులు నిలబడి ఉంటారు. ఆమధ్యగ సుబ్బారావు ఆవేశంతో వచ్చి నిలబడతాడు.)

సుబ్బారావు: ఒరేయ్! మీరెవరూ గొడవ చేయకండ్రా.

(అందరూ నిశ్శబ్దం.)

(లక్ష్మి, చంద్రం వెనుక భయంగా నిలబడుతుంది. ఆమె వెనుక రమణి పిల్లాడ్ని ఎత్తుకొని వచ్చి నిలబడితే, లక్ష్మి పిల్లాడిని తీసుకొని ఎత్తుకుంటుంది. ధర్మయ్య మంచం మీదనుండి లేవబోయి విఫలుడై కూర్చుంటాడు.)

సుబ్బారావు: (కోపంగా) చంద్రన్నా! యింకా ఎన్నాళ్ళు సమ్మె చేయిస్తారు. మేమంతా పనిలోకి దిగిపోవాలనే వచ్చాం. ఏమంటారు దీనికి?

రామయ్య: (ఉద్రేకంగ) సోదరులారా? మనం ఏ హక్కుల కోసమైతే యీ సమ్మెను ప్రారంభించామో, అవి నెరవేరే వరకు మనం వెనకడుగు వేయకూడదు. యీపరీక్ష సమయంలో, మీరిలా దిగజారిపోవడం మనకు, మన పార్టీకి, మన ఆశయాలకు క్షేమం కాదు. ఇంతకాలం మనం పౌరుషంగా ఎదిరించి, హక్కులను పొందే ముందు, మరణిస్తామనే పిరికితనంతో, లొంగిపోవడం మొత్తం కార్మిక సమాజాన్నే దెబ్బ తీయడమవుతుంది. అప్పుడు మనం విపరీత నష్టానికి గురిఅవుతాము. అందుచేత మనమంతా ఎన్ని కష్టాలువచ్చినా అనేక రకాలదారులు త్రొక్కకుండా, ఏకైక నాయకత్వంతో నడవ వని మిమ్ములనందరిని కోరుతున్నాను.

సుబ్బారావు: కొంత మంది పని మీదికి పోవడానికి సిద్ధంగాఉన్నారు.

రామయ్య: ఎవళ్ళు?

సుబ్బారావు: చాలా మంది.

రామయ్య: వాళ్ళను నాకు చూపించు. సమ్మెను భగ్నం చేయాలనే కుట్రదారులన్న మాట.

సుబ్బారావు: వాళ్ళు దిగుతామంటే మనం చేసేదేముంది?

రామయ్య: అందరము కలిసి ఏ మక్కికి ఆమక్కి విరగగొట్టడమే! పదండి! వాళ్ళెవళ్ళో నాకు చూపించండి.

(ముందుకు వెళ్ళబోతుంటే లక్ష్మి అడ్డంపడుతుంది. కూతురు తల్లి చంకలోనున్న తమ్ముడ్ని తీసుకుంటుంది.)

లక్ష్మి: వొద్దు బావా! వొద్దు! (కార్మికుల వేపు తిరిగి) నాయనలారా! మీకు దణ్ణం పెట్టి చెబుతున్నాను. వాళ్ళ పనులకు వాళ్ళను వెళ్ళనివ్వండి. వాళ్ళను కొట్టొద్దు తిట్టొద్దు. యీ సమ్మె విరమించండి, మీ అందరికి భార్యా బిడ్డలు లేరా! వాళ్ళందరు ఆకలికి, దరిద్రానికి గురై ఎన్నెన్ని బాధలు పడుతున్నారో మీకు కనిపించటంలేదా? ఎంత మంది పిల్లలు పాలు, కూడు లేక ఏడ్చి ఏడ్చి సొమ్మసిల్లి పోతున్నారో తెలియడంలేదా? మీ హక్కులను సంపాదించడానికి, సమ్మెకు మించిన ఆయుధం దొరకనేలేదా! విజ్ఞానం వేపు పరుగెత్తుతూన్న నేటి ప్రపంచాన్ని సమ్మె పేరుచెప్పి పరిశ్రమలు, దేశము నాశనమయ్యేలా చేయడమే మీ దారా? వెళ్ళండి, అందరూ పనిలోకి దిగండి.

రామయ్య: లక్ష్మీ! (కోపంగా గట్టిగా ప్రక్కకు త్రోసివేస్తే క్రిందపడి తల నేలకు గట్టిగా తగులుతుంది) రామయ్య చూడకుండ ఆ కార్మికులతో నిష్క్రమిస్తాడు. రమణి, తమ్ముడు ఏడుస్తూంటారు. లక్ష్మి నోటి నుండి రక్తం కారుతుంది.

ధర్మయ్య: హారి దుర్మార్గుడా, ఎంత పని చేశావురా!

(మంచం మీది నుండి లేవబోయి క్రింద పడతాడు.)

లక్ష్మి: (నోటిలో నుండి క్రింద పడిన రక్తాన్ని చూచి— తన అరచేతిని రక్తంలో ముంచి, ఐదు వ్రేళ్ళను ఎడంగా ఉంచి, రక్తపు అరచేతిని చూచి భయపడి, తరువాత పిచ్చిగా నవ్వుతుంది. ధర్మయ్య దేకుతూ ఆమె వద్దకు వచ్చి ఆమె చేతిని పట్టుకొని చూస్తాడు. భయకంపితుడౌతూ కోపంతో వణకి పోతుంటే— ఆమె పిచ్చిగా నవ్వుతూ లేచి నిలబడుతుంది రమణి తమ్ముడితో ఒక మూలగా భయంతో దాక్కుంటుంది. లక్ష్మి ఇటు అటు పిచ్చిగా నవ్వుతూ, పిచ్చిగా తిరుగుతూంటే ధర్మయ్య ఆమె వెళ్ళిన వేపే తల వూపుతూ, రెప్పవాల్చకుండా చూస్తూంటాడు.)

లక్ష్మి: (నవ్వుఆపి.) లోకం యెంత పిచ్చిది మామయ్యా ఇప్పుడు సంపాదిస్తున్న రోజు కూలి, జాగ్రత్తగా వాడుకోవడం చేత కావడం లేదు. యీ తెలివి మొదట్లోనే ఉంటే, ఆ సంపాదన నుండి కొంత పొదుపు చేసుకున్నట్లైతే యీ సమయంలో యిట్టి అగచాట్లు వచ్చి వుండేవి కావు గదా! జీతం రాళ్ళు వచ్చినన్నాళ్లు కన్ను మిన్ను గానక, దుర్వ్యసనాలకు లోనై అప్పులపాలై కూర్చున్నారు. అప్పుడు సుఖపడి చచ్చాము గనక యీ అణా..రెండణాలువస్తే సుఖపడతామనే ఆశ ఏమైనా వుందా మామయ్యా? యీ సమ్మెతో బీదాళ్ళ దరిద్రమంతా మంట కలిసి పోతుందట, నిజమేనా మామయ్యా?

ధర్మయ్య : ఆ రెండణాల లోటును భర్తీ చేయడంకోసం, రెండు వందల ప్రాణాలు హతమారినా సంతోషమేనంటారు తల్లీ.

లక్ష్మి : మరి ! ఆ ప్రాణాలు హతమారిపోయే సిద్ధాంతాల కన్నా ప్రతి కార్మికుడికి స్థాయిగా జీవించే అలవాట్లను ఈ నాయకులు అంతా కలిసి నేర్పడం చేతకాదా మామయ్యా ?

ధర్మయ్య : స్థాయిగా బ్రతకడం నాయకులకే చేత కాదు, వీళ్ళకేమి నేర్పుతారమ్మా?

లక్ష్మి . వాళ్ళ బతుకులు ఎలాగా స్థాయిగా లేవనుకో— మరి బీదాళ్ళ బ్రతుకులు ఎందుకు నాశనం చేస్తున్నారు?

ధర్మయ్య : బీదవాళ్ళ బ్రతుకుల నీడలో— నాయకులు కాపురం చేస్తున్నారు, రాను రాను వారి నేత్రాలు రాబందుల నేత్రాలులాగా తయారౌతున్నాయి.

లక్ష్మి : ( భళ్ళుననవ్వి —ఒక్కసారి ఆపుతుంది.) ఐతే వాళ్ళ గ్రుడ్లు నేను పీకేస్తాను—నేను పీకేస్తాను (ఉద్రేకంగా లేస్తుంది )

ధర్మయ్య : లక్ష్మి-కూర్చో తల్లీ ! నీకో మంత్రం చెబుతా ఇది విను.

(లక్ష్మి విధేయతతో దగ్గరగా కూర్చుంటుంది, తరువాత కొంచెం దూరంగా వెళ్ళి కూర్చుంటుంది. చటున లేస్తుంది. పిచ్చిగా నవ్వుతుంది. రామయ్య ప్రవేశించి భార్యను చూచి దిగ్భ్రమ చెంది అక్కడే కొయ్యబారి పోతాడు.)

లక్ష్మి : మామయ్యా ! అదిగో— చూశావా— ఆ కనపించేవి ఏమిటో తెలుసా ? రాబందుల నేత్రాలు— రాబందు నేత్రాలు వాటిని పీకేయాలి—పీకేయాలి,

(వేళ్ళు వంకరగాపెట్టి భర్త మీదకు వెళ్ళబోతుంది. భర్త ఆమె రెండు చేతులు గట్టిగా పట్టుకుంటాడు. వారిద్దరి మధ్య పెనుగులాట జరుగుతుంది. భర్త చెయ్యి కరుస్తుంది. భర్త విడిచిపెట్టేస్తాడు లక్ష్మి పిచ్చిగా నవ్వుతూ నిష్క్రమిస్తుంది.)

రామయ్య : (చెయ్యి చూసుకొని బాధపడి) నాయనా— ఏమిటి ఇదంతాను ?

ధర్మయ్య . సమ్మె యొక్క విషపరిణామం ముందుగా నీ ఇంట్లో నాంది అయ్యింది.

రమణి : నాన్నా ! (గొల్లున ఏడుస్తుంది. పిల్లాడు ఏడుస్తాడు) నాన్నా , అమ్మ తమ్ముడికి ఆకలేస్తున్నది. నాన్నా...నాకు అన్నంకావాలి. తమ్ముడికి పాలు కావాలి. నాన్నా (తండ్రిని పట్టుకొని ఏడుస్తుంది.)

రామయ్య : [రామయ్య ఏమీ మాట్లాడలేక క్షణం సేపు నిలబడి పోతాడు ]

ధర్మయ్య : నాయనా ! సమ్మె మానెయ్యండి—పనిలోకి దిగండి, సమ్మె ఎప్పుడు దీర్ఘకాలం జరుగకూడదు. ఇప్పుడు కార్మికులు ఆగలేరు. వెళ్ళు — వెంటనే వెళ్ళి అందరినీ పనిలోనికి పొమ్మని చెప్పు, పో,

రామయ్య : మన ఇంటి బాధల గురించి సమ్మె భగ్నం చెయ్యడమా ?

ధర్మయ్య : సమ్మె భగ్నం కాదోయ్ ముఖ్యం. నీతోటి ప్రతి బీదసంసారము భగ్నమై, నిమిషాలమీద మసై నీట్లో కరిగి నేలలో ఇంకిపోవడానికి సిద్ధంగా ఉన్నది. పో.

రామయ్య ఇప్పుడే ఆఫీసుకు పోయి నాయకులందరినీ ఒప్పించి అందర్నీ పనిలోకి పంపే ఏర్పాటు చేస్తాను.

[తొందరగా నిష్క్రమిస్తాడు. రమణి తమ్ముణ్ణి తీసుకుని అమ్మా అమ్మా అంటూ ఏడుస్తూ నిష్క్రమిస్తుంది.]

(సశేషం)

[ తెర పడుతుంది ]

## అధికార భాష

1972 అక్టోబరు 1 వ తేదీ నుంచి జిల్లా పరిషత్తులలో ఉత్తరప్రత్యుత్తరాలు పరిపాలన వ్యవహారాలు అన్నీ తెలుగు భాషలో జరగాలని ఇంగ్లీషు భాష ఉపయోగించరాదని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆదేశించింది. జిల్లాపరిషత్తు సభ్యులు జిల్లా పరిషత్తుల అధ్యక్షుల మధ్య ఉత్తరప్రత్యుత్తరాలు, జిల్లాపరిషత్తు సమావేశాలు, పంచాయతీ సమితులతో ఉత్తరప్రత్యుత్తరాలు, జిల్లాపరిషత్తులు వాటి అధీనంలో వుండే విద్యాసంస్థల మధ్య ఉత్తరప్రత్యుత్తరాలు తెలుగులో జరగాలని ప్రభుత్వం ఆదేశించింది.











# "భారత దర్శన్"

భారత ప్రభుత్వ సంగీత, నాటక విభాగం తరపున మే 20వ తేదీన గాంధి భవన్‌లో "భారత దర్శన్" నృత్య నాటికా ప్రదర్శనం జరిగింది. గవర్నరు శ్రీ ఖండూభాయి దేశాయి ముఖ్య అతిథిగా ప్రదర్శనం తిలకించారు.





## జవహర్ బాలభవన్

బాల భవన్ వార్షికోత్సవ సందర్భంగా మే 23వ తేదీన రవాణా మంత్రి శ్రీ కె. ప్రభాకర రెడ్డిగారికి బాలకళాకారుల పక్షాన పుష్ప గుచ్ఛ ప్రదానం. జూన్ 11వ తేదీన రవీంద్ర భారతిలో "అంతరిక్ష యానం" నృత్య నాటిక ప్రదర్శించారు.





# శ్రీ నారాయణ తీర్థులు

యశ్వంత సిన్హా

శ్రీ నారాయణ తీర్థులవారు 1675_1745 కాలము వారు. పూర్వాశ్రమమున వారి పేరు గోవింద శాస్త్రి. తండ్రి పేరు నీలకంఠ శాస్త్రి. ఇంటి పేరు తల్లావఝ్ఝులవారు. గుంటూరు జిల్లా మంగళగిరి సమీపమునవున్న కాజగ్రామవాసి. ఆ కాలమున ప్రసిద్ధిచెందిన శ్రీ వాసుదేవ పండితులనే మహా విద్వాంసులవద్ద చతుష్షష్టి కళలు అభ్యసించారు. సంగీత సాహిత్య నృత్యకళలలో మిక్కిలి అభిమానము కలవారు. చిన్నతనమునుంచే శ్రీ కృష్ణ భగవానునిపై భక్తితో ఆడుతూ, పాడుతూ తన్మయులయ్యేవారు. శ్రీ లక్ష్మీనృసింహస్వామి వారి క్షేత్రమయిన వేదాద్రిలో 8 సంవత్సరాలు తపస్సు చేశారు. స్వగ్రామమయిన కాజకు వచ్చి, అక్కడ ఆగిపోదలచిన తమ తమ్ముని కుమారుడైన నృసింహ శాస్త్రిగారిని ఆశీర్వదించారు. "మన వంశములో 21 మంది జ్ఞానులగుదురు". మహనీయులయిన శ్రీ తీర్థులవారు. ఆకారమున పొడగరి. కాళ్ళకు గజ్జెలు, ఒక చేతిలో చిరతలు, మెళ్ళో తంబూరా వ్రేలాడుచుండగా, రెండవ చేతితో, ఆ తంబూరాను వాయించుతూ, నృత్యముచేస్తూ పాడుతుండేవారట. కాశీ క్షేత్రమున 8 సంవత్సరములు వున్నారు. సంస్కృతమున పది గ్రంథములు వ్రాశారు.

తిరిగిరాస్తూ అమలాపురం తాలుకా, కూచిమంచి గ్రామంలో మూడేండ్లు నివసించారు. తరువాత రేపల్లె తాలుకా, వెల్లటూరులో మరి మూడేండ్లు నివసించి కొంతమంది శిష్యులకు తమ తరంగాలు పాడే విధానము నేర్పారు. ఇప్పటికిని అక్కడివారు కొంతమంది యీ విద్యలో ప్రవీణులై శ్రీ తీర్థులవారిని స్మరిస్తున్నారు. పిమ్మట అద్దంకి సీమలో, ఆరేండ్లు వుండి 60 మంది గ్రామవాసులకు, తరంగాలు పాడుతూ, నృత్యం చేయడం నేర్పారు. శ్రీ అద్దంకి వెంకట్రాయుడుగారు, బాపట్లలోనున్న శ్రీ భావనారాయణస్వామి కోవెలలో, ధ్వజస్తంభమువద్ద "బాలగోపాల" అను తరంగమును రాత్రి 9 గంటలకు ప్రారంభించి మరునాడు ఉదయం 11 గంటల వరకు నృత్యము చేస్తూ, అద్భుతముగా పాడి, ప్రేక్షకులను ముగ్ధులను చేశారు. అప్పుడు గరుత్మంతుడు వచ్చి ముమ్మారు ప్రదక్షిణము చేసిన తరువాత హారతు లివ్వడం జరిగింది.

తిరుపతిలో శ్రీ వెంకటేశ్వర స్వామి వారి దర్శనాంతరం స్వామివారి ఆజ్ఞచే, వరహూరు చేరి అక్కడ మూడేండ్లు వున్నారు. అక్కడ గూడ కొంతమంది శిష్యులను తయారుచేశారు. వరహూరులో మందిరము కట్టించి శ్రీకృష్ణ విగ్రహమును ప్రతిష్ఠించి చక్రస్థాపనచేసి, స్వామి ఎదుట తరంగములు పాడుతుండేవారట.

తంజావూర్ జిల్లా తిరుపూందుర్తిలో స్వామి నారాయణ తీర్థులవారి జీవసమాధి వున్నది. ప్రతి సంవత్సరము ఆరాధన జరుగుటయు శిష్య ప్రశిష్యుల గూడి తరంగాలు సంకీర్తన చేస్తూ స్మరించుచున్నట్లు జీవసమాధి కాపరులైన విశ్వనాథ భాగవతార్ ద్వారా తెలియుచున్నది. శ్రీ తీర్థులవారి తైల చిత్రము. వరహూరు దేవాలయములో వున్నది. శ్రీ నారాయణ తీర్థులవారు మహిమ గల సత్పురుషులు. త్యాగరాజస్వామి గురువులైన శ్రీ శొంఠి వెంకట రమణయ్యగారి తండ్రి వెంకటప్పయ్యగారికి తీర్థులవారు గురువులు. కాశీవాస దినములలో, ఉదయము గంగకు స్నానార్థము వెళ్ళే సమయములో వారి శరీరము నుంచి సుగంధ సువాసనలు విరజిమ్ముట బట్టి వారిని కొందరు శంకించిరి. పిదప ఒకరోజు రాత్రి మఠం తలుపుల సందులలో నుంచి గుంపుగా వచ్చిన వారిలో నాయకులు ఒకరినొకరు చూచి నోటమాట లేని



వారైరి. అంత అందరూ నిచ్చెనల సహాయముతో మఠముపై కెక్కి చూచి పరవశులైరి. మరునాడు ఉదయం శ్రీ తీర్థులవారు, యథాప్రకారము స్నానార్థము గంగకు వెళ్ళు సమయమున వారందరూ పాదాక్రాంతులై క్షమాపణ కోరిరట. "తమర్ని అనుమానించి పరీక్షించుటకు రాత్రి ప్రయత్నము చేయగా మాకు అలౌకిక ఆనందము కలిగెను తాము తరంగములు పాడుతూ, నృత్యము చేయుట తమతోకూడ వలయాకారమున గోపికలు రాధాకృష్ణులు నృత్యము చేయుట దర్శించి ఆనంద పరవశులమైతిమి. శంకించిన మా దుష్ట ప్రవర్తనను క్షమింపుడని" వేడుకొనిరి. అప్పుడు తీర్థులవారు, భగవద్దర్శనమయిన మీరు ధన్యులని వారిని ప్రశంసించిరి శ్రీ తీర్థులవారి గేయకల్పనా సామర్థ్యము అద్వితీయమయినది ఆ కాలమున వాడుకలోనున్న అన్ని రాగములలోను, తాళములలోను, అశేష ప్రజ్ఞతో శ్రీకృష్ణ లీలాతరంగిణి రచియించి శ్రీ త్యాగరాజాది మహామహులకు ఆదర్శకులైరి. శ్రీ తీర్థులవారి గురుపరంపర, శివరామ తీర్థులవారి గురుపరంపర. శివరామ తీర్థులు గోపాల సరస్వతి, గోవింద సరస్వతి, రామానందులు (వీరి పూర్వాశ్రమనామము వారణాసి ధర్మభట్టు. సాహిత్య రత్నాకరము, రత్నప్రభ వ్యాఖ్య రచించిరి) శ్రీ తీర్థులవారి శిష్యపరంపర, గౌడ బ్రహ్మానందులు, కాశ్మీరక సదానందులు, ఆంధ్ర మహేశ్వర తీర్థులు. ఏక వాక్యములో సగుణ నిర్గుణములను బోధించు శక్తి, విద్యాశంకరుల తరువాత నారాయణ తీర్థులకే కలదనియు వాచస్పతి మిశ్రుని మధుసూధన సరస్వతిని మించిన ప్రజ్ఞ గలదనియు, కాశీ పండితులు తీర్థులవారి గ్రంథ భూమిలో లిఖించిరి. డా॥ మాడభూషి కృష్ణమాచార్యులవారు ప్రాచీన సంస్కృత కవుల చరిత్రలో మాధవానల బిల్హణకవి, బృహన్మంగళుడుగా, జయదేవుడుగా తుదకు నారాయణ తీర్థులుగా అవతరించినట్లుగా కనబడుచున్నది. శ్రీ నారాయణ తీర్థ వారి గ్రంథములు ప్రసిద్ధికెక్కినవి. శ్రీకృష్ణ లీలాతరంగిణి, హరిభక్తి సుధార్ణవము మొదలయిన భక్తి వేదాంత గ్రంథములను, తెలుగులో పారిజాతాపహరణము అను యక్షగానమును రచించిరి శ్రీ రాజగోపాల శాస్త్రిగారు యతి ఎల్లప్పుడును తరంగములను పాడుతూ, నృత్యము చేయుచుండెడివారు రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయుడుగారు, రాజగోపాల శాస్త్రిగారు "బాల గోపాల" తరంగము పాడుచూ నృత్యము చేయుచుండుట చూచి ఆనందించి ప్రసన్నులై, అయాచితముగా 400 ఎకరముల, ఖండ్రిక కాజగ్రామంలో సమర్పించినారు అంత్య కాలములో "పరమహ పశ్యత పూరుషం స్వీకృత మాయిక మానుషం" స్మరించుచు బ్రహ్మీభూతులైరి. వరుసగా ఆ వంశములో తరువాత వారు మా తండ్రిగారివరకు యతులై, తరంగముల గానము చేయుచూ సిద్ధిపొందిరి. మా పినతండ్రీ, నేటి సాహిత్య సామ్రాట్ శ్రీ శివశంకరస్వాముల వారూ, నేనూ నారాయణ తీర్థులవారి వంశమునకు చెందినవారము.

---

## ఈ సంచికలోని రచయితలు

శ్రీ మండలి వెంకటకృష్ణారావు, సాంఘిక సంక్షేమశాఖామంత్రి హైదరాబాదు,

శ్రీ పి.ఎస్. గోపాల్, ఐ.సి.ఎ.ఆర్, న్యూఢిల్లీ

శ్రీ రేపూరు అనంతపద్మనాభరావు, ప్రభుత్వకళాశాల, కందుకూరు

శ్రీ ఎన్. కామరాజు పంతులు, లెక్చరర్, దయానంద్ కామర్స్ కళాశాల, లాతూరు(మహారాష్ట్ర)

శ్రీ బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి, వేంసూరు, ఖమ్మంజిల్లా

శ్రీ అసనుద్దీన్ అహమ్మద్, సంయుక్త కార్యదర్శి, రెవిన్యూ బోర్డు, హైదరాబాదు

శ్రీ టి. ప్రకాశరావు, డి.పి.ఆర్.ఓ, శ్రీకాకుళం

శ్రీ సి.వి. నరసింహారెడ్డి, సమాచారశాఖ, హైదరాబాదు

శ్రీ మహేష్, ఎల్.ఐ.సి. ఆఫీసు, హైదరాబాదు

శ్రీ పువ్వుల చలపతిరావు, కొత్తగూడెం కాలరీస్, ఖమ్మజిల్లా

శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, సమాచారశాఖ, హైదరాబాదు

శ్రీ యశ్వంత సిన్హా, జాన్‌రోడ్, సికింద్రాబాదు

శ్రీ కె.వి. హనుమంతరావు, హైదరాబాదు

# మహాభారతము

తెన్నెగంటుల లక్ష్మణశాస్త్రి

## 58

"సాధ్వీరత్నమా! నీ మాట వలన సంప్రీతుడనైతిని. నా క్రోధము నశించెను. నీవు నాకు చేసిన నింద అనుచితముకాదు. అది నాకు శ్రేయస్సును కలిగించును. నీకు మంగళమగుగాక. పోయివచ్చెదను." ఇట్లుచెప్పి కౌశికుడు తనను తాను నిందించుకొనుచు తన స్థానమునకు పోయెను' అని మార్కండేయుడు చెప్పి తరువాతికథ యిట్లు చెప్పదొడగెను: —

### ధర్మ వ్యాధుని కథ

"కౌశికుడు చాలసేపు తన అకార్యమునుగూర్చి చింతించుచు జనక మహారాజు పాలించుచున్న మిథిలకు అనేక నదీ పర్వతారణ్యములను దాటిపోయెను. ఆ నగరమునందెక్కడ చూచినను ధర్మకార్యములే జరుగుచుండెను. అచ్చట ధర్మవ్యాధ గృహమును కనుగొని ఆ యింటికి పోయెను. ధర్మవ్యాధుడు అనేక విధములగు పశువుల మాంసమును విక్రయించుచు అంగడిలో కూర్చొనియుండుటను చూచి సమీపమునకు పోజాలక కౌశికుడు దూరముగా నొక మూల నిలచి యుండెను. అతనిని చూచి ధర్మవ్యాధుడు అంగడి దిగివచ్చి 'బ్రాహ్మణోత్తమా! నమస్కారము. నేను వ్యాధుడను (కటికవాడు) నాకేమి యాజ్ఞయిచ్చెదరు? పతివ్రత చెప్పగా మీరిక్కడికి వచ్చితిరి. మీరు ఏ కారణముచేత నిచటకు వచ్చినదియు తెలియును. ఆమె అన్నియు మీకు బోధించి పంపెను' అని యనెను.

ఆ మాటలు విని కౌశికుడు మహాశ్చర్య భరితుడయ్యెను. అతనికి గలిగిన అనుభవములలో నిది రెండవది. మొదటిది— తాను కొంగను దహింపజేసిన సంగతి పతివ్రత కనుగొనుట. రెండవది యిది. ఈ యిరువురు తమ ధర్మబలముచేతనే అనను భూతమగు విషయమును కనుగొన గలిగిరని యతడత్యాశ్చర్య చకితుడయ్యెను.

తరువాత వ్యాధుడు 'మహాత్మా! ఇది మాంస విక్రయశాల. మీవంటివారు నిలువదగిన చోటుకాదు. దయచేసి మా యింటికి పోవుదము రండు' అని కౌశికుని తోడ్కొని తన యింటికి పోయెను. అర్ఘ్యపాద్యాదులతో పూజించి సుఖాసనముపై నతనిని కూరుచుండ బెట్టెను. అప్పుడు బ్రాహ్మణుడు వ్యాధునితో 'మాంస విక్రయ కార్యము నీవంటి వానికి అనుచితము. ఇట్టి నీ ఘోర కర్మచేత నా మనస్సు మిక్కిలి తపించినది' అనెను. ఆ మాటకు ధర్మవ్యాధు డిట్లనెను: —

"బ్రాహ్మణా! నా తండ్రి తాతల కాలమునుండి ఈ కర్మ మా కులమునకు ఉచితమైయున్నది. స్వధర్మము నాచరించుచున్న నా యెడల మీరు కోపపడకూడదు. బ్రహ్మదేవుడు మా కులమునకు నిర్ణయించిన కర్మమును పాలించుచు వృద్ధులగు నా తలిదండ్రులను సేవించుచున్నాను. నేను సత్యమునే పలికెదను, అసూయపడను. యథాశక్తి దానము చేసెదను. దేవతలకు, అతిథులకు, భృత్యులకు, కుటుంబ వ్యక్తులకు భోజనము పెట్టిన తరువాత మిగిలిన దానిని భజించి సంతృప్తి చెందెదను. ఇతరుల దోషములను ఉగ్గడించను, ఇతరులను నిందించను. ఎందుకనగా, ఇప్పుడు చేయబడిన శుభాశుభ కర్మఫలములు భవిష్యత్తునందు కర్తను అంటగలవు.

"బ్రాహ్మణోత్తమా! ఈ జనకుని రాజ్యమునందు నాలుగు జాతులవారు తమ తమ కర్మల నాచరించుచు ధర్మశ్రద్ధగలవారై యుందురు. స్వకర్మను వీడిన వారిని దండించి యీ రాజు వారి వారి కర్మలలోనుంచును. జనకుడు అపరాధియగు పుత్రుని గూడ దండించును, పరుడయినను ధర్మపరుని ఆదరించును. ఈ రాజు స్వధర్మమును రక్షించుకొనుచు నందరి వర్ణాశ్రమ ధర్మములను యథావిధిగా రక్షించు చుండును. నేనెప్పుడు గూడ జీవహింస చేయను. ఇతరులు తెచ్చి యమ్మిన వివిధ పశువుల మాంసమును విక్రయించుచుందును. మాంస భక్షణము చేయను. ఋతుకాలమునందే భార్యాసంగమము చేసెదను. పగలు ఉపవాసముచేసి ప్రతిదినము రాత్రి భుజించుచుందును. మంచిజాతిలో పుట్టని మానవుడు గూడ నొకప్పుడు శీలవంతుడగును. ప్రాణిహింస చేయువాడు గూడ ధార్మికుడగును. రాజులు వ్యభిచారము చేయుటచేత ధర్మసాంకర్యము కలిగి అధర్మము వర్ధిల్లును. ప్రజలుగూడ సాంకర్య దోష దూషితులగుదురు. దానిచేత, అట్టి ప్రజలకు పుట్టు సంతానము గూడ, భయంకరాకారము గలవారు, పొట్టివారు, వంకర శరీరముగలవారు, లావు తల గలవారు, నపుంసకులు, అంధులు, చెవిటివారు, ఎత్తయిన కన్నులు గలవారుగా నగుదురు. మా జనక మహారాజు ధర్మపరుడు గనుక మా దేశ ప్రజలుగూడ

ధర్మాత్ములే నన్ను నిందించువారితోను, ప్రశంసించు వారితోను నేను మంచిగానే వ్యవహరించు చుందును.

“ఏ రాజు ధర్మమును పాలించుచు జీవితము గడుపునో, ధర్మమతితోనే వ్యవహరించునో, ఇతరుల వస్తువుల నపహరించడో ఇంద్రియనిగ్రహము కలిగియుండునో, అట్టి రాజే ఉత్తముడనిపించుకొనును. తనశక్తిననుసారము అన్నదానము చేయవలెను. సర్వప్రాణులను తగినట్లుగా నాదరించవలెను. శీతోష్ణ సుఖదుఃఖాది ద్వంద్వములను సహించవలెను దృఢమైన ధర్మశ్రద్ధ గల్గియుండవలెను ఈ సద్గుణములు స్వార్థత్యాగము లేని మనుష్యులకు ఉండజాలవు వ్యర్థముగా వాదించగూడదు ఇతరులకు ప్రియము చేయవలెను. కామ-క్రోధ-ద్వేషాదులవలన ధర్మము నెప్పుడు గూడ మానగూడదు, ప్రియమగు వస్తువు లభించినప్పుడు హర్షించి. అప్రియలాభమునందు దుఃఖించుటయు తగదు ఆర్థికముగా చిక్కులు కలిగినప్పుడు మోహము చెందరాదు ఎట్టిసంకటములందుగూడ ధర్మత్యాగము చేయగూడదు. ఒకవేళ ఎప్పుడైనను చేసినకర్మము తప్పుఅయినచో దానిని తిరిగి చేయగూడదు. మంచి కర్మయందె సర్వదా మనస్సును పోనీయవలెను· తనకు చెడుపు చేసిన వానికి తిరిగి చెడుపు చేయరాదు. ఇతరులకు హాని చేయజూచు పాపాత్ముడు స్వయముగా నష్టడగును. ఇతరులకు అహితము చేయుట దుష్టులపని. 'ధర్మములేదు' అనితలచు వాడే పుణ్యాత్ములను పరిహసించి నశించును. అట్టివానిపాపము, ఊదబడు తోలుతిత్తిలో గాలి త్వర త్వరగా నిండి లావైనట్లు పెచ్చు పెరుగును. వాడు నశించును. ఉత్తముడు వినయముతోనే అంతట వ్యవహరించును. అహంకారము గల పాపిష్ఠుడు తలచు ప్రతిమాటయు అసారమై యుండును. వాడు పలుకు మాటలు, సూర్యుని తేజస్సు పగటియందు వస్తువులను స్పష్టముగా కనపరుచునట్లు, వాని హృదయమును తెలుపుచుండును.

“బ్రాహ్మణోత్తమా! మూర్ఖుడు ఆత్మస్తుతి చేసికొనినంత మాత్రమున ప్రకాశించడు. విద్వాంసుడు దరిద్రుడయ్యు ప్రకాశించును. ఆత్మస్తుతి పరనిందలను విడువనిదే ప్రపంచములో ప్రతిష్ఠ పొందజాలడు తానుచేసిన పాపమునకు పశ్చాత్తాప పడినచో చేసిన పాపము నశించును. 'ఇకపైన నెప్పుడుగూడ పాపము చేయను' అని ప్రతిజ్ఞ చేయుటచేత భవిష్యత్తులో నతనికి పాపము అంటదు. ఈ విధముగా నతడు ఉభయ పాపముల నుండివిముక్తుడగును. తపోయజ్ఞ జపదానాదులను నిష్కామ బుద్ధిచేత ఆచరించినచో పాపవిముక్తి కలుగును. ధర్మము విషయమై వేదములో నిట్లు చెప్పబడినది. వినుము:—

“తొలుత చేసిన సత్కర్మ ఫలము—తరువాత కాలములో పొరపాటున చేసిన అధర్మమునుగూడ నశింప జేయును· పాపము చేసికూడ 'నేను చేయలేదు! అని తలచుకొన గూడదు. వాడు చేసిన పాపము వాని లోపలనేయున్న దేవతలు—పరమాత్ముడు చూచుచునే యుందురు. తన దోషములను కప్పిపుచ్చి యితరుల దోషములను మాత్రమే ప్రకటించుచుండు వానికి పరలోకములో సుఖము కలుగదు. పాపము చేసికూడ సత్కార్యాదుల నాచరించు వాడు మేఘమునుండి విడిపోయిన చంద్రుడు ప్రకాశించినట్లు పాప విముక్తుడై ప్రకాశించును సూర్యోదయము కాగానే అంధకారము నశించునట్లు సత్కర్మలు పూర్వ పాపములను నశింపజేయును. పాపములకు లోభమే కారణము శాస్త్రజ్ఞానము లేక లోభము కప్పబడిన వారి మనస్సు పాపాచరణమునకు సాగును· గడ్డి కప్పిన కూపమువలె అల్ప చిహ్నముచే కప్పబడి రహస్యముగా అధర్మము నాచరించు దుష్టులెందరో యుందురు అట్టి ధార్మిక వేషధరులు ఇంద్రియ నిగ్రహము పవిత్రత్వము, ధర్మచర్చను ఇతరులకు జూడ నటించుచుందురు కాని వారి ప్రవర్తన వల్ల వారి తత్త్వము తెలియగలదు” ఇట్లు ధర్మ వచనములనువిని కౌశికుడు 'శిష్ట ప్రవర్తనను ఎట్లు తెలియనగును?' అని యడుగగా ధర్మవ్యాధుడిట్లు చెప్పదొడగెను :—

“బ్రాహ్మణోత్తమా! శిష్టాచారుల యందు యజ్ఞము దానము, తపస్సు, వేదాధ్యయనము, సత్యము ఇవి యుండును. ఎవరు కామ-క్రోధ-లోభ దంభ-కుటిలత్వములను అణచి సర్వదా ధర్మమునే ఆచరించుచు సంతోషముతో నుండుదురో వారుశిష్టులు స్వేచ్ఛగా తిరుగక యజ్ఞాచరణ వేదాధ్యయనములందే ఆసక్తులై యుండు వారును శిష్టులే యగుదురు. శిష్టాచారులందు సర్వదా 'గురుసేవ' సత్యవాక్యము, అక్రోధము, దానము, ఈ నాలుగు గుణము లుండును. శిష్టాచారము నందే సర్వదా మనస్సును నిలిపిన వాడు పొందుఉత్తమస్థితినిమరియెవడును పొందజాలడు· వేదములసారము సత్యమనియు సత్యముయొక్క సారము ఇంద్రియముల నిగ్రహమనియు. ఇంద్రియ నిగ్రహ సారము త్యాగమనియు శిష్టాచారుడు సర్వదా తలచుచుండును· సద్ధర్మమునందు దోషములను ఉద్ఘాటించు వాడు తననే కాక తన అనుయాయులను గూడ చెడుత్రోవలో దించును. శిష్టులు మంచి మార్గములో నడచుచు తమను అనుసరించు వారికి సన్మార్గ దర్శకులగుదురు,

“బ్రాహ్మణోత్తమా! నీవు నాస్తికులు—అధర్మపరులు, క్రూరులు పాపులు నైనవారి సాంగత్యము విడిచి జ్ఞానము నాశ్రయించి ధర్మాత్ములను సేవించు చుండుము ఈ శరీరము ఒకనది ఇంద్రియములు నదీజలము కామక్రోధాదులు మొసళ్ళు. ఈ నది జనన మరణములనెడు దుర్గమారణ్య మార్గములో ప్రవహించు చుండును· దీనిని దాటుటకు నీవు ధైర్యమనెడు నావలో కూర్చొనవలెను· అది దుఃఖమును తరింపజేయును· స్వచ్ఛమగు తెల్లని వస్త్రముపైన రంగుబాగుగా నంటుకొనునట్లే, శిష్టాచారము చేత పరిశుద్ధమగు బుద్ధియోగము గల పురుషునకు ధర్మము ప్రకాశితమగును.

“అన్నిటికన్న పరమమగు ధర్మము అహింస· అది సత్యమునందే ప్రతిష్ఠితమై యుండును· సత్యము ఆధారముగా చేసికొని శ్రేష్ఠ పురుషుడు చేయు సర్వకార్యములు నెరవేర గలవు, కనుక శిష్టాచార పరాయణులందరు సేవించుసత్యమే ఉత్తమోత్తమమైనది· సత్ప్రవర్తనమే సత్పురుషుల ధర్మము. సదాచారము గలవారే సత్పురుషులు· ప్రతివాడును తన ప్రకృతి ననుసరించియే నడచును. పాపాత్ముడే కామక్రోధాదులకు వశుడగును· న్యాయ యుక్తమగు ప్రయత్నమే ధర్మమనబడును. అనాచారమే అధర్మమని పెద్దల

మతము శిష్టాచారులకు కోపము అసూయ, అహంకారము, మాత్సర్యము లేకుండును. వారు ఋజువర్తనులై మనోనిగ్రహము గలిగి యుందురు. సత్త్వగుణము గలిగి, పాపులకు వీలుకాని యాచారము-కర్మము చేయుచు, తాముచేయు సత్కర్మల వలన ప్రపంచములో సత్కరింప బడుచుండు వారియొక్క హింసాది దోషములు స్వయముగా నశించును. అట్టివారు స్వర్గసుఖము ననుభవించెదరు.

"ధర్మము, వేదోక్తము, ధర్మశాస్త్రోక్తము, శిష్టాచారము, అని మూడు విధములుగా నుండును. శ్రేష్ఠపురుషుల ఆచారలక్షణ మేమనగా, విద్యచదివి యుండుట, పుణ్యతీర్థముల యందు స్నానము చేయుట, సత్యము, ఓర్పు, ఋజువర్తనము, మనశ్శుద్ధి, ఇవి కలిగియుండుట, 'సర్వ ప్రాణులయందు దయ' అహింస, కఠినముగా మాట్లాడకుండుట యనబడు నీ గుణములు గలవారు సత్పురుషులు. శుభాశుభ కర్మ ఫలమును తెలిసినవారు శిష్టులనబడుదురు. ఇట్టి సద్గుణ భూషితులు స్వర్గసుఖమును పొందెదరు. ఉత్తములువచ్చి దానమడిగినప్పుడు శిష్టులు భార్య పుత్రులకు బాధకల్గించు వస్తువైనను లేదన యిచ్చెదరు. పూర్వము చెప్పబడిన సజ్జనులు లోకమునకు ప్రాణభూతులు సుమా! అట్టివారు లేనిలోకము నశించునని భావము 'ఎవరికి ద్రోహము తలచకుండుట' దానము చేయుట, సత్యము పలుకుట, ఈ మూడిటిని సర్వదా ఆచరించుటయే శిష్టులమతము. అట్టివారు ధర్మ మార్గములో ఉత్తమగతిని చేరెదరు. పైన చెప్పబడిన సద్గుణములే సత్పురుషుల మార్గములు. ఆట్టి శిష్టాచారులు జ్ఞానమనెడు మేడపైనెక్కి సంసార భయమునుండి విముక్తులగుదురు. ఆ మేడపైనుండి ప్రపంచములోని సర్వవ్యవహారములను, పుణ్య పాపములను జూచుచుందురు. బ్రాహ్మణోత్తమా! శిష్టాచారుల గుణములను గూర్చినేను విన్నంత నాకు తెలిసినంత నీకు తెలిపినాను.

## అహింసా—హింసల వివేచనము

"నేను చేయుచున్న మాంసవిక్రయ కర్మ అత్యంత ఘోర మైనది. అన్నిటికన్నను దైవము బలవత్తరము మనము పూర్వ జన్మమునందు చేసిన కర్మమునకే 'దైవము' అనిపేరు. దానిని దాటుట చాలకష్టము. కర్మదోషమువలన కలిగిన యీ వ్యాధకుల జననము, నేను పూర్వజన్మములో చేసిన పాపఫలము వలన కలిగినదని భావించెదను. ఆ దోషనివారణకు ఇప్పుడు నేను ప్రయత్నము చేయుచున్నాను. బ్రహ్మదేవుడు జీవుల మరణమును పూర్వమే నిర్ణయించియుండును. కాని వ్యాధుడు (కసాయివాడు) కేవలము నిమిత్త మాత్రుడగును. అనగా, నెవ్వడు స్వేచ్ఛగా తెలిసి జీవహింస చేయునో. అట్టి ఘాతుకుడు హింసా దోషములో భాగస్వామి యగును.

బ్రాహ్మణోత్తమా! ఈ హింసా కార్యములో నేను నిమిత్తమాత్రమే యగుదును. నేను పశువుల మాంసమును విక్రయించక ఆ జంతువులు బ్రతికియుండగా వాటిని దేవ-అతిథి భృత్య పితృ పూజలకై, వాడు కొనియుండిన యెడల దానివలన అత్యంత ధర్మమునాకు లభించియుండెడిది. 'ఓషధులు, ఆహార ధాన్యములు, గడ్డి, లతలు, పశువులు, మృగములు, పక్షులు ఇవి అనాదికాలమునుండియు సర్వ ప్రాణులకు ఉపయోగపడునవి.' యని వేదములో చెప్పబడినది. క్షమావంతుడగు శిబిచక్రవర్తి తనమాంసమును దత్తముచేసి శాశ్వత స్వర్గసుఖమును అనుభవించెను. మాంసవిక్రయము నా కులధర్మము. దీనిని విడువ కున్నాను. పూర్వమునుండి మా పెద్దలు చేసినపని కనుక దీని చేతనే నా జీవనమును నిర్వహించుచున్నాను. స్వధర్మమును విడుచుట అధర్మమనియు దానిని వలంబించుట ధర్మమనియు పెద్దల నిర్ణయము. పూర్వనిహితమగు కర్మదేహిని విడువదని బ్రహ్మ నిర్ణయము. క్రూరకర్మచేయువాడు సర్వదా 'నేనుమంచి కర్మను ఎట్లు చేయగలుగుదును. ఎట్లు ఈ చెడుకర్మనుండి విముక్తిని పొందుదును' అనిచింతించుచుండవలెను. అందువలన నేను దానము-సత్యము-గురుసేవ-బ్రాహ్మణపూజ-ధర్మముగానడుచుట అను నీ సత్కర్మలయందే సర్వదా తత్పరుడనై యుండెదను. అభిమానము-అధికప్రసంగము విడిచి యున్నాను. కృషి కర్మ ఉత్తమమని కొందరనుకొందురు. కాని దున్నునప్పుడు భూమిలోని ప్రాణులు నాగేలిదెబ్బకు చచ్చుటయే కాక, భూమిపై నున్న యితర ప్రాణులు గూడ మరణించును. కనుక కృషి కర్మవలన కూడ హింసయే కలుగును. విత్తనములు గూడ జీవులే. ఎందరో పశువులను చంపి తినెదరు. వృక్షములను, సస్యములను కోసెదరు. చెట్లలో, ఫలములలో, జలములలోను అనేక జంతువులు ఉండును-ప్రాణులను తినియే ప్రాణధారణ చేయు జీవులెన్నియో యున్నవి. చిన్న చేపలను తిని పెద్ద చేపలు బతుకు చున్నవి. భూమిపైన నడచునప్పుడు మనము అనేక జీవరాసులను త్రొక్కి చంపుదుము, కూర్చున్నప్పుడు, శయనించు నప్పుడు, జ్ఞానులు-విజ్ఞానులు గూడ జీవులను చంపుదురు. ఈ భూమ్యాకాశములు జీవులతోనే నిండి యున్నవి. తెలియకయే ఎన్నిటినో చంపుచుందురు. 'అహింస-అహింస' అని చెప్పుటయేకాని యీ లోకమునందు జీవహింస చేయని వారెవరు? నేను చాల యోచనచేసి 'క్రియాశీలుడగు వాడెవడుకూడ అహింసకుడు కాజాలడు' అని నిర్ణయించు కున్నాను. అహింసాధర్మమును పాలించుయతులు గూడ ఏకొంచెము హింసనైనను చేయవలసిన వారగుదురు. గొప్ప యింటిలోపుట్టి, సద్గుణ సంపన్నులై ఉత్తములనిపించు కొన్నవారు గూడ అతిభయంకర మగు దుష్కర్మలను చేసి సిగ్గు పడెదరు. సత్కర్మలనుచేయు మిత్రులను మిత్రులు, శత్రువులను శత్రువులు మంచి దృష్టితో చూడరు. బ్రాహ్మణా! ఈ విధముగా లోకమునందు ఎన్నియో విపరీతములు కనపడు చుండును. అధర్మమే ధర్మమనిపించును. ఈ విషయములలో నీవేమందువు. కనుక ధర్మాధర్మ కార్యముల విషయములలో నింకను ననేకములు చెప్పవచ్చును. కనుక అన్నిటికి మించినది తనకులోచితమగు కర్మను ఆచరించుటయే. అట్టివానికే గొప్పకీర్తి లభించును.

## ధర్మసూక్ష్మము—మోక్షోపాయములు

"ధర్మనిర్ణయములో వేదమే ప్రమాణగ్రంథము. ధర్మగతి అతి సూక్ష్మము. ఎట్లనగా, ప్రాణాపాయము నందును, వివాహము నందును అసత్యము పనికివచ్చును. అట్టి వేళలలో

అసత్యము వలననే సత్యఫలము, సత్యమువలననే అసత్యదోషము లభించును. ప్రాణులకు హితమైనదే సత్యము. సత్యము చెప్పుట వలన, ఇతరులకు ప్రాణహానికాని అహితముకాని కలుగునప్పుడు అది అసత్యము అనగా అధర్మమే యనబడును. కష్టములు కలిగినప్పుడు అజ్ఞానియగువాడు అవి తనపూర్వ కర్మఫలములని భావించక నిందించును. మూర్ఖులు, దుష్టులు, చపలచిత్తులు, సుఖమును దుఃఖముగాను, దుఃఖమును సుఖముగాను భ్రాంతిచే తలచెదరు. అట్టి వారిని, బుద్ధిగాని నీతిగాని విద్యగాని రక్షింపజాలదు. పౌరుషముచేత సంపాదించిన కర్మఫలము ద్వారా పురుషుడు తాను కోరిన వస్తువును స్వతంత్రుడై సాధించుకొనగలడు. నేర్పరులు, నిగ్రహము గలవారు బుద్ధిమంతులైన వారుగూడ పనిచేయుచు చేయుచు అలసిపోయి తమ యిచ్ఛానుసారముగా కర్మఫలమును పొందజాలరు. కొందరు హింసకులు, వంచకులై యుండికూడ లోకములో సుఖము ననుభవించుచున్నారు. ఏపనియు చేయక ఊరక కూర్చున్న వానికి సంపద చేరుటయు కష్టించి పనిచేయు వానికి సంపద చేకూరకుండుటయు చూచుచున్నాము. కొందరు దీనులై పుత్రాపేక్షచేత దేవతాపూజలు తపస్సులుచేసి కనిన పుత్రులు కులమునకు కళంకము తెచ్చు దుష్టులుగా పుట్టుచున్నారు. కొందరు అట్టి కర్మలద్వారా సత్పుత్రులను కనెదరు. మనుష్యులకు శరీరమానసిక రోగములు పూర్వకర్మములుగా సంభవించుచుండును. అవి వారిని బోయవారు మృగములను వలె బాధించుచుండును. అట్టి ఆధి వ్యాధులుగూడ నేర్పరులగు వైద్యులచేత పోగొట్టబడును. తినుటకు పుష్కలముగా నున్నప్పటికిని అజీర్ణాది రోగములవలన కొందరు ఏమియు తినజాలకున్నారు. బలవంతులై జీర్ణశక్తి గలవారికి కొందరికి భోజనమే లభించదు. ఈ విధముగా నీ ప్రపంచ జనులు అసహాయులై శోకమోహములలోపడి పూర్వ కర్మఫల ప్రాప్తములగు ఆధి-వ్యాధులలోనై బాధపడుచుందురు.

"మనస్సును-బుద్ధిని-ఇంద్రియములను వశములో నుంచుకొని జాగ్రత్తతో మెలగువారికి జరా మరణములు వశములో నుండును. వారు తమ కోరికలను పూర్తిచేసికొనగలుగుదురు. వారికి ఎట్టి బాధలు కలుగవు. అందరు అభివృద్ధి నొందవలెనని చాల ప్రయత్నించుచుందురు. కాని అభివృద్ధి అందరికీ లభించుటలేదు. అనేకులు ఒకే నక్షత్రమునందు జన్మించెదరు. వారందరికిని జరుగు జాతకర్మాది శుభ సంస్కారములు గూడ సమానముగనే యుండును. కాని, వారి వారి పూర్వ కర్మము ననుసరించి యీ లోకమునందు ఫలానుభవములో చాల భేదముండును. తన చేతికందిన వస్తువునుగూడ నుపయోగింపజాలక యెందరో బాధపడుచుందురు. 'జీవుడు సనాతనుడు-శరీరము అశాశ్వతము. దేహము నశించినను జీవుడు అన్యదేహమునందు సంక్రమించును. ఇది యంతయు తత్తత్కర్మానుసారముగా జీవునకు కలుగుచుండును అని వేదములలో చెప్పబడినది." ధర్మవ్యాధుడు చెప్పిన అనేక ధర్మవచనములు విని మిక్కిలి యానందించిన కౌశికునకు వ్యాధునకు నిట్లు సంవాదము జరిగెను :—

కౌశి :— ధర్మజ్ఞుడా! జీవుడు శాశ్వతుడెట్లగును? దయయుంచి చెప్పుము

వ్యా :— దేహ భేదమయినంత మాత్రమున జీవుడు నశించడు. జీవుడు మరణించుననుట మిథ్య. అతడు దేహాంతరమును పొందును. పాంచభౌతికమగు శరీరము నుండి జీవుడు పోయిన తరువాత అది పృథివ్యాది పంచ మహాభూతములలో చేరును. దానినే శరీర నాశమందురు. మనుష్యుడు చేసిన కర్మల ఫలమును అతడే యనుభవించును. చేసిన కర్మములు గూడ ఫలానుభవములేక నశించవు. ఇది కర్మ సిద్ధాంతము. పుణ్య కర్మ చేసినవారు పుణ్యాత్ములుగాను, పాప కర్మకరులు పాపాత్ములుగాను జన్మించి పుణ్య పాపకర్మములనే తిరిగి చేయుచుందురు. పుణ్యపాపకర్మలచేత బద్ధులై తిరిగి జన్మించెదరు.

కౌశి :— సత్పురుషుడా! జీవుడు ఇతర యోనులలో నెట్లు జన్మించును? అతనికి పాప-పుణ్య కర్మముల సంబంధమెట్లు కలుగును?

వ్యా :— మనుష్యుడనుభవించునదంతయు కర్మఫలమే యగును. ఈ విషయమై సంగ్రహముగా నీకు చెప్పెదను వినుము. జీవుడు పూర్వము సంపాదించిన కర్మ సంస్కారముల ననుసరించి పుణ్య-పాప యోనులలో తిరిగి పుట్టును. శుభకర్మల ఫలముచేత దేవత్వము, శుభాశుభ కర్మల ఫలముచేత మనుష్యత్వము, కేవలము అశుభ కర్మాచరణ ఫలముచేత పశు పక్షి, మృగాది నీచత్వమును జీవుడు పొందును. పాపియగువాడు చివరకు నరక దుఃఖము గూడ ననుభవించును. అట్టివాడు తాను చేసిన దోషముల ఫలముగా జనన-మరణ-జరాది రూపమైన సంసార చక్రమునందు మరల మరల జన్మించును, దుఃఖించుచు బాధపడుచుండును. కర్మబంధము వారిని వెన్నంటగా తిర్యగాది యోనులందు వారు జన్మించుచుందురు. పాప కర్మల ననుభవించుటకు జీవుడు పాపయోనులందు పుట్టును. అపథ్యమును భుజించిన రోగివలె తిరిగి తిరిగి బాధలనే పాపి యనుభవించును. ఈ విధముగా సంసార చక్రమునందు పరిభ్రమించుచు బాధపడుచుండును. కర్మబంధము విడిపోయిన తరువాత పశ్చాత్తాపపడి యెవడైన సత్కర్మాచరణము చేసినచో పుణ్య మార్గములోపడి పుణ్యలోకములకు పోవును. పాపమే చేయుచుండినచో దాని అంతమును వాడు పొందలేడు. కనుక పుణ్య కర్మలయందే అనురక్తుడై యుండవలెను. అసూయ లేనివాడై, కృతజ్ఞుడై మంచికర్మలు చేయుచుండు వానికి సుఖము-ధర్మము-ధనము లభించును. మంచి సంస్కారము గలిగి, జితేంద్రియుడై, పరిశుద్ధాచారవంతుడగుచు, మనస్సును వశములో నుంచుకొనినచో ఈ లోకమునందును పరలోకమునందును సుఖము కలుగును. కాబట్టి మనుష్యుడు సర్వదా సత్పురుషులాచరించు ధర్మము ననుసరించుచు, శిష్టుడుగా వ్యవహరించుచు, ఏ జీవికి గూడ కష్టము కలుగని విధముగా జీవికను గడపుచుండవలెను. (సశేషము)

# వందే మాతరం

హైదరాబాదు ఖండము : రాయన్ పరాక్రమము

ముదిగొండ వీరభద్రమూర్తి

విప్లవ వీరుడు ఫాడ్కేతో పినాకపాణి చెప్పిన పూర్వగాథ

హూణులపై నభిమానము పూర్ణిమా
చంద్రబింబము మంత్రిశాక్వరునకు
నే జామున నిజాము రాజిల్లు బెదవి నిం
డిన ప్రేమ నష్టమీ నిశ మనస్సు
అధికారులన్ గొ ద అటు కొంద ఇటు కొంద
అ కది యమావాస్యరాత్రి ప్రజకు
బహుళచతుర్దశీ ప్రాభాత శశిరేఖ
యరబులు రోహిలా లాంగ్లజధికు

లిట్టి హైదరాబాదున పృతన తోడ
శ్వేతముఖు డొండు వైస్రాయి చేతిక్రింద
నుండు రెసిడెం టనంగ పరిశోచితము జ
వాబున నవాబు చిత్తము బా బనంగ

గుండెలు తీసెడు బంటుగ
నుండును రెసిడెంటు చారయుతి నడిప్రోన్
మండల నాథున కాచా
ర్యం డై హితబోధమున నహో యన జనముల్

పాలనా నాటకమున జవనికవెనుక
నుండి శబ్దమ్ము నందించుచుండు నతడు
దాని నంది పలుకడొ పాత్రధారి మరల
కనుపడడు భాగ్యనగర రంగమ్మునందు

మతి మంతుడు మనస్వి మానధనుడున్ మాన్యుండు రాజా
మహీ
పతిరాయాఖ్యుడు ఫ్రెంచి సఖ్యుడు నిజాం భాయీ యనన్
దన్నునం
దె తనర్చున్ గుజరాతివా డొక దరాత్రి శ్రేణి దుస్స్వప్నమై
సతతాన్య ప్రభుతాంత్యకాలగణనా శ్రామ్యత్సుధీ పోషియై

ఎన్నో హేమంతనిశల్
విన్నవి రాయడు నిజాము వివిధాంశములన్

సన్నగ జర్చించుట, యిటు
లన్నాడొకనాడు రాయ డా జనపతితో

సేనాపతి సలబత్ ఖాన్
హూణు నెదుర ననియె నో ప్రభూ! హారములన్
గానుక లంపితి నెన్నె
న్నో: నిన్ననె సి ధియాకు హోల్కారునకున్.

నా మూలమున గా దినకుము
నీ 'మీరాలము' ప్రధాని నీడ యగుచు ని
న్నోముున్ గాత! సికందరు
జా! మన్నివసనము మార్చుమా యెటకేనిన్.

పురమును విడువ దలంచితి
దరలింపుము నన్న టన్న దత్ప్రభు వనె నా
కవల లైనది హృదయము
తరలుము నిను బ్రోవలేని దౌర్భాగ్యనిధిన్.

ప్రభురూపము నున్న బానిస నయా ! రాజా !
పరంగీలకున్
క్షుభితాత్ముండ నెదుర్చి లోగిలిని రాజ్యోదీర్ణ వాంఛన్ మృతి
ప్రభవంబుల్ దినముల్ భజించు నొక చిత్రపాణి నే మన్న నీ
వు భరింతున్ భరియింపలేనటవె! రావు ల్గైన యీగుండెతో

కొడుకును బట్టిమ్మని న
న్నడిగెనొ రెసిడెంటు కా దనన భాయీ! ముం
క్కిడి హోదా కొఱకై నా
యెడలినె కోసికొని తినుట కొప్పిన వాడన్,

చెవులు లేని గోడలమధ్య జెలగె నిట్టు
నా మహీపతి రాయ నిజాముల కొగి
భాషణము మహీపతి తరువాత బయలు
దేరె బీరారునకు సుబేదారు డగుచు.

వచ్చె మహారాష్ట్రులతో
గచ్చెన్ హూణు లొనరించు కదనము పైస్రా
యిచ్చె నిజామున కాజ్ఞన్
బుచ్చుము సేన నని యతడు పుచ్చెను దానిన్.

శతముల్ తొమ్మిది గుఱ్ఱపుందడము షట్సాహ
స్రపాదాత మొ
క్కటఁ దరిన్ దర్లెను రోహిలాలు నరబుల్ తన్ముఖ్య
యోధుల్ మహీ
పతి రాయండు వరూధినీపతి రణంబై పోయి పైస్రాయి మ
త్పృతనన్ లూటి యొనర్చె నీబలమిదేమీ ఓ! నిజామూ!
యనెన్.

అయ్యయో! అయ్యయ్యో! అ
య్యో! యనియె నిజాం, మయయొ గియొయొ కాదు మహా
రయము మహీపతి బర్తర
ఫయినటు వినుపింపు మనుచు పైస్రాయి చనెన్.

సరెయనె గాని యానతివి సల్పడ యా విధి నెన్నినాళ్లకు
న్నరపతివిన్నవించుటకు నైచని యేదియొ వింత బెద్దమం
తిరి విసిగెన్ బొమల్ ముడిచితెచ్చె బరిన్ రెసిడెంటు వంకర
క్కరముల క్లప్తపత్రి మఱువార్ద్రిము పోయెను నాడు
రాయికై.

రూపించెన్ మము కంటగించుటలు ధారూర్దౌలతాబాదు బా
ద్నాపూర్కోటలు చేంనీయక, దురాత్మవ్రాతముల్ నీ
పురిన్
మా ఫౌజున్ మమునుండి వాపుటకు నింబాల్కార్ముఖుల్
పూనినా
రాపన్జాలవా! నీవ టంచు రెసిడెం టాడెన్ ధరానాధుతో

మానితు రాజారావ్రం
భానింబాల్కారును శహరుబద లనియె నిజా
మానాడే 'నూరుల్లు
మాశ్రినరశింగాశ్రివ్దిగంబ' రాఖ్యుల కత్తై.

గులుబర్గాజిల్లాలో
గల దొక కిల్లా య దేదొ కదలె నటకు రా
బలిమి మహీపతిరాయుడు
తొలిరాణువ తన్ను విడక తోడుగ నడువన్.

కిల్లాకావలిమై మహీపతి నిటుల్ క్రేణించె గాల మ్మహో!
కిల్లాకున్ సచివేంద్రు కమ్మ గొని బేగీరావు లేతెంచి రం
దుల్లేఖ మ్మిద వైరి యర్థి సిరి రుద్రుం భద్రు నున్నిద్రుగా
బెల్లగ్గించు పతీ! ధనవ్యయమునం బీరారు లెక్కింపుమా.

తాను తీసికొనిన ధనమున కెపుడు పై
స్రాయి యొప్పజెప్ప జమయు ఖర్చు
నేను సపుడ యని లిఖించి మహీపతి
మాలుజాబు నంపె వారి కొసగి.

మీరాలం వినుపింప నా లిపి నిజా మేమీ యనం డయ్యె పీ
నారాన్ సైదనుహామువించు రెసిడెం టంపింతు హూణాధికం
బై రేచుల్బలె దూకు ఫౌజతని నేయ న్నాలుకల్ గ్రోయునా
ధార మ్మన్నది కుత్రికేసనియె, సిద్ధం బయ్యె దండెత్తుటల్.

అట మహీపతిరాయుని భటసమూహ
ముఁకు నాయకు డౌచునొప్పు నొక స్పెయిను
జోదు పేరు క్లెమెంటీ; యవాదృతాంగ్లు
డతడు ఫ్రెంచిఖత్తున దీర్చె బృతన నెల్ల.

అతడు తల, తక్కుచుబుకరు ఽవయవములు
సేన యేంతమూవర్తి సింహమూర్తి
యతని యసమానరణకుశలతకు రాయు
డే గురువు రాయుడే ప్రాణ మిందరికును.

మృతి పంపించు జ్వరమ్ము సాటి యిదిగో! మీరాల
మంపించె జీ
టి తమాయించితి చించివేయక క్లెమెంటీ యంచనెన్
దన్మహీ
పతి యాసైఫన్దౌర నల్పుడెల్ప నిది యై స్వాతంత్ర్య
సూర్యోదయ
స్థితి పూర్వం బగు యుద్ధకల్యమును సూచించెం బ్రభూ
యం చనెన్

మన ప్రత్యుత్తరమంపి బఠించుచునెయామంత్రిప్రధానుండు సే
నను బుత్తెంచియయుండు సాంగ్లముగ సన్నద్ధుండవై
యొక్కగొం
టును బోనీకువె! వాని యింటికి గ్లెమెంటూ! మేటి బంటూ,
యటం
చనె రాయండు, ఫిరంగు లెత్తి మొన నాహ్వానించె
సేనానియున్.

వచ్చిపడియెను రెసిడెంటుబలము చలము
పట్టి నైకవిధాయుధోజ్జ్వలము, కలము
పట్టి యెవ్వడు వ్రాసినన్ వర్ణనమ్మ
చిట్టి దగునటు లతడు సేసె సమరమ్ము.

బర్గ బూర్గయ్యె, పాల్మరు పల్మరెడసె
బెల్లియరుకు దళ్ళియ లేదు పృథివి, యెట్టి
పూలు పూచె గాడ్రెను కడు ఘోర నేమి,
రాయడు క్లమెంటి యతిలోక రణ మొనర్ప.

పదమూడుశతమ్ముల కున్
సదనము చేరినది మూడు శతములె యాంగ్ల
ప్రథిత మహోగ్రధ్వజినిన్
కదనము నీరీతి జేయ గల వారెవరో !

# యాదగిరి గుట్ట

కె. వి. హనుమంత రావు



యాదగిరిగుట్ట

ఆంధ్రప్రదేశములో పేరెన్నిక గన్న పుణ్య క్షేత్రములలో 'యాదగిరిగుట్ట' కడుప్రశస్తమైనది. చిన్నపాటి పర్వత శిఖరాగ్రమున విశాలమైన గుహలో శ్రీ లక్ష్మీనరసింహస్వామి వెలసిన కారణముగా వేలాది జనం ఆ భగవంతుణ్ణి సేవించుచూ, తమ కోరికలను తీర్చుకొంటున్నారు.

అవతారము లన్నిటిలోను నరసింహావతారము విశిష్టమై శక్తి సంపన్నమై, ప్రభాన్వితమై యున్నది. బ్రహ్మేంద్రాదులచే స్తుతింపబడుచు సకల చరాచరముల కధిపతియై, దుష్టశిక్షణ-శిష్ట రక్షణ చేసిన మహామహుడు శ్రీ లక్ష్మీనరసింహుడు.

హిరణ్యకశిపువధానంతరము ప్రహ్లాదుడు శ్రీహరి కరస్పర్శచే దివ్యజ్ఞాన సంపదల కధిపతియై స్వామి చరణారవిందములపై ప్రణమిల్లి "స్వామీ! నన్ను కామోప భోగములకు దూరముచేసి నీ దాసులలో ఒకనిగా ఆశీర్వదించమని వేడుకొనగా, "కాలము ననుసరించి, బంధవిముక్తుడవై నాదరి చేరగలవు. నా దర్శన మనన్యలభ్యము. కావున నీ అభిమతము తెలుపుము." అనగా "స్వామీ నీ తేజస్సును గ్రహించని నా తండ్రి నిన్ను దూషించెను. అతనిని పునీతునిగా చేయ వేడుకొనుచున్నాను." అనగా "ప్రహ్లాదా! నిన్ను కన్నందుకు నీ తండ్రి తరించుటయేగాక, నీ వంశవృక్షమంతయు తరించినది." అనగా "స్వామీ! నా యందనుగ్రహింతువేని, నిరంతరము నిన్నారాధించునట్లు అర్చారూపములో నిచట వేంచేసియుండ గోరెదను." అన్న ప్రహ్లాదుని కోరికను మన్నించిన నరసింహుడు 'నే నిచ్చట ప్రసన్నరూపముతో నుండి ఆరాధించబడుట లోకసమ్మతముకాదు. యిచ్చటి కనతిదూరములో నున్న పర్వత శిఖరాగ్రమందు అర్చారూపముతో వెలసెదను. ఇది లోకోపకారము కూడ కాగలదు అని చెప్పి స్వామి, దేవతా గణముతో శ్రీశైల శిఖరాగ్రమునుండి బయలుదేరి దేవతలు, మహర్షులు స్తుతించగా బ్రహ్మాది దేవతలు వెంటరాగా ఇప్పుడు భక్తులపాలిట కల్పతరువై విరసిల్లిన 'యాదగిరి గుట్ట' యనబడెడి శిఖరాగ్రము నందలి విశాలగుహలో అర్చారూపములో నావిర్భవించెను.

భక్తవత్సలుడు భగవానుడు అయిన శ్రీమన్నారాయణుడు నరసింహావతారమై వెలసిన పుణ్యక్షేత్రమునకు 'యాదగిరి' యనెడి నామము సంప్రాప్తమగుట కూడ విచిత్ర విశిష్టమై యున్నది.

## "యాదగిరి" అనే పేరు

పూర్వము త్రేతాయుగమున విభాండకుడను మహాతపస్వికలడు. వేదవేదాంగ పారంగతుడైన ఋష్యశృంగుడు ఆయన కుమారుడు. ఋష్యశృంగ శాంతాదేవులకు కలిగిన సంతానమే 'యాదఋషి'. ఈతడు బాల్యమునుండి భగవద్భక్తితో నిరంతరము హరి



హనుమాన్ ద్వారంవద్ద భిక్షకులు

ధ్యానములో గడిపెడివాడు. నరసింహుడన్న ఈతనికి మహాప్రీతి. నరసింహ మంత్రానుష్ఠానమున కనువగు ప్రదేశమెక్కడాయని అతను గాలించని ప్రదేశములేదు. ఎచ్చటను తృప్తిచెందక విసిగి వేసారి, శాంతి లభించక చింతించుచుండెను.

ఒకనాటి స్వప్నమున ఆంజనేయుడు దర్శనమిచ్చి, "నాయనా! నీ తలంపు అనల్పం, నీ సంకల్పం త్వరలోనే నెరవేరగలదు. ఇచ్చటికి అనతి దూరములో లక్ష్మీ నృసింహస్వామి వెలసిన పుణ్యక్షేత్రము, నీ కోరికలు తీరుటకు అనువైన ప్రదేశము. కాని మహాభయంకరము, దుర్భేద్యమైన యా మార్గమున ఎన్నియో బాధల కోర్వవలసియుండును. భక్తితత్పరుడవైన నీకు జయము కలుగక మానదు." అని దీవించి మార్గమును విశదీకరించి మాయ మయ్యెను.

వాయు ప్రసారము ఏ మాత్రము లేకయు, కంటకావృత ప్రదేశమును అతి భయంకరమైన అరణ్యములను, పెనుగాలులచే ఎడారులయందును, అత్యంత కష్టతరమైనను కార్యసాధన కొరకు భరించి, మార్గమధ్యమున ప్రశాంతమైన ఋష్యాశ్రమములు చేరుకొని అచ్చట మునిబాలకులచే నరసింహుడు వెలసియున్న ప్రదేశమును తెలిసికొని, సర్వభూతములు సంతసముగా నుండినట్టి



విష్ణుపుష్కరిణిలో స్నానమాడు భక్తులు

చోటునుగాంచి, అదియే లక్ష్మీనరసింహుని ప్రసన్నతకు అనువైన ప్రదేశము అని తలంచి తీవ్రముగా తపస్సు చేయనారంభించెను.

వేల సంవత్సరములు అతి ఘోరముగా తపస్సు చేసిన కారణముగా, ఆంజనేయుడు ప్రసన్నుడై "నీ పట్టుదల అత్యంత ప్రశంసనీయము. నీ తలంపును మేము పరీక్షించి సంతసించితిమి. ఇచ్చటనే విశాలమైన గుహలో శ్రీ లక్ష్మీనరసింహ స్వామి అదృశ్యముగా వెలసియున్నాడు. నీ మనోవాంఛితము అతి త్వరలోనే నెరవేరగలదు." అని అభయమొసంగగా యాదర్షి సమాధి చాలించి గుహలో ప్రవేశించెను. క్రూర మృగమయము విషకీటకాది కంటకములతో నిండి గాఢాంధకారముగా నున్నట్టి గుహలోకి ప్రవేశించి నరసింహుని గూర్చి తీవ్రతపస్సు చేయదొడంగెను.

భక్త జన ఆర్త బంధుడైన నరసింహస్వామి యాతని తపస్సునకు మెచ్చి, అతి భయంకరమగు జ్వాలాకారముగా ఆవిర్భవించగా ఆ తేజస్సు చూడలేని యాదర్షి సాష్టాంగ ప్రణామము ఆచరించి, "మహాత్మా? దేవ దేవా! నీ యుగ్రరూపమును చూడ లేకున్నాను. ప్రసన్నుడవు కమ్ము తండ్రీ!" అని ప్రార్థించగా ఉగ్రరూపమును చాలించి ప్రశాంతుడై "నాయనా నీ తపస్సునకు మెచ్చితిని నీ యెడ ప్రసన్నుడను. నీ అభిమతములను కోరుకొనుము" అనగా 'మహాత్మా! నీ దర్శనభాగ్యము నాకు అనంత భాగ్యము నా తపస్సు సిద్ధించినందున ఈ పర్వతము నా పేరుతోనే పిలువ బడవలయును. సర్వకాలము నీ స్వరూపము సేవించుచూ అర్చించు భాగ్యము ప్రసాదించుము." అని వేడుకొనగా, అందులకు స్వామి సంతసముతో అనుగ్రహించి, తన దివ్య స్వరూపమును చూపించి, యాదర్షిని తరింపజేసి జ్వాలామాలలతో జ్వాలా నరసింహుడై యావిర్భవించెను.

అందులకే ఈ క్షేత్రము యాదర్షి పేరిట ప్రసిద్ధిగాంచి, "యాదగిరిగుట్ట"గా 'యాదగిరి-లక్ష్మీ నరసింహస్వామి' క్షేత్రముగా పిలువబడుచున్నది.

ఈ క్షేత్రమునకు పాలకు డుండవలయునన్న తలంపుతో యాదర్షి, అందులకు శ్రీ ఆంజనేయుడే సమర్థుడని తలంచి, ఆ మహాహుని తనభక్తి తత్పరతచే మెప్పించి, ఒప్పించెను. ఆంజనేయ స్వామి - నరసింహస్వామి ముందుభాగమున ఒక రాతిపై అర్చారూపములోవెలసి, ఈ క్షేత్రమునకు పాలకుడై తనను సేవించు భక్తుల కోర్కెలు తీర్చుచు, స్వామి ద్వారముకడ ప్రసన్నాంజనేయుడుగా వెలసియున్నాడు.

## ఎంత దయో దాసులపై......

యాదర్షి ఒకనాడు శిఖరాగ్రమున విష్ణుకుండ తీరమున భగవద్ధ్యానోపాసకుడై యుండ, ఒకానొక బ్రహ్మరాక్షసి ఆకలి దప్పులచే యాదగిరి శిఖరమునకు చేరి, యాదర్షిని మ్రింగుటకై ఏతెంచగా, భక్త జన రక్షకుడైన నృసింహుని ప్రేరణచే జ్వాలామయమైన సుదర్శన చక్రము, ఆ రాక్షసిని సంహారించినది.

యాదర్షి ఆ సుదర్శన రాజమును తన భక్తి భావముచే సంప్రీతుని గావించి, ఆ క్షేత్రముననేయుండి, సదా భూత, ప్రేత, పిశాచాదులను, యక్ష, రాక్షస భయములను నివారించమని ప్రార్థించగా సుదర్శనుడు సంతసించి, స్వామి గోపురమందు షట్కోణముతో ఆవిర్భవించి, స్వామి దర్శనమునకై వచ్చు భక్తులను సదారక్షించు భారమును స్వీకరించెను.

సుదర్శనుని అనుగ్రహముచే యాదర్షి స్నానము చేయు విష్ణుకుండము మహాపవిత్రమై విష్ణుపుష్కరిణిగా విలసిల్లినది. స్వామివారి పాదాలనుండి రెండు ధారలు బండల మధ్యన నుండి, పుష్కరిణిలోకి ప్రవహిస్తూవుంటవి. ఇందు స్నానమాడినచో నృసింహస్వామి పాదతీర్థ మాచరించినంత పుణ్యఫలము లభ్యమగునని ప్రతీతి.

కొంతకాలము తరువాత యాదగిరి గుట్ట చెట్లుచేమలచే, మనుష్య సంచారమునకు నలవికాక స్వామి యున్న సంగతి మరుగున పడిపోయెను. నారసింహుడు తనకు తానే పరిచయము



విష్ణు పుష్కరిణిలో సూర్య నమస్కారం చేయు భక్తుడు

చేసుకొన నెంచి, పర్వత సమీప గ్రామములోని అధికారి కలలో కనిపించి, తన ఉనికిని తెలియజేసెను.

ఆ వృత్తాంతమును ప్రజలకు ఎరుకపరచి, ఒక శుభ ముహూర్తమున బయలుదేరి, 'యాదగిరి'నధిరోహించి, దుర్భేద్య మైన, మిగుల అపాయకరమైన ఆ కొండను గాలించి, చీలిపోయిన రెండు బండల మధ్య, స్వామివారి చిహ్నములను గుర్తించి, సకల సంతసముతో ఆనాటి నుండియు, ఆరాధనలు ధూప దీపములు సక్ర మముగా జరిపించుట మొదలిడిరి.

ఆనాటినుండి శ్రీ యాదగిరి లక్ష్మీనృసింహ స్వామి భక్తుల పాలిటి పెన్నిధియై, కోర్కెలు తీర్చు సన్నిధియై, లోకారాధ్యుడై, వైభవోపేతముగా విలసిల్లు చున్నాడు.'

శరణాగత వత్సలుడైన స్వామివారి మహిమలు అనంతము లైనవి. అందులకే స్వామి అనుగ్రహమునకై వేలాది ప్రజలు, దూర ప్రాంతములనుండి వచ్చుట జరుగుచున్నది.



సింహ ద్వారము

భక్తుల భక్తి భావ ప్రతీకలుగా, ప్రాకార, మండప, సింహ ద్వార, గోపురాదులు అతిరమ్యముగా నిర్మాణము గావింపబడినవి. వెండిపై బంగారు తాపిన ద్వారాలు, గోపురం మీద బంగారు పసిడి కుండలు చూచుటకు ఎంతో ఆహ్లాదకరముగా నుండును. ఆలయములోని ఆరాధనలు దక్షిణ దేశపు ఆచార వ్యవహారముల ననుసరించి జరుగుచున్నవి.

ప్రతిదినము ఆ మహామహునికి గోక్షీరములతో నభిషేకము జరుగుచుండును. ఆ సమయమున పంచసూక్తములు, పంచోప నిషత్తులు, వేద వేదాంగ పారాయణము జరుగుచుండును.

స్వామి వారి బ్రహ్మోత్సవము ప్రతి సంవత్సరము 'నవరాత్రి' విధానముగా వేలకొలది భక్తుల సేవలతో జరుగుతూ వున్నది.

'వాల్మీకి భవనము'లో ధార్మిక సంగీత మహాసభలు, దేశమునందు ప్రసిద్ధిగాంచిన మహాపండితులచే జరిపించటం జరుగుతూవున్నది. ఈ సభావిశేషములను వినుటకుగాను, సంగీత, సాహిత్య ప్రియులు దూర, దూర ప్రాంతముల నుండి కూడా వచ్చుచుందురు.

యాత్రికుల సౌకర్యార్థము నూటనలువది ధర్మశాలలు, వివాహములు, ఉపనయనములు జరుగుటకు వీలుగా కల్యాణ మంటపము భక్తుల చేతనే నిర్మింపబడియున్నవి.

నీటి వసతికూడ చక్కగా కలదు సౌకర్యార్థము గుట్ట క్రిందనున్న గోకుండము ద్వారా పైకి నీరు పంపించుట జరుగు చున్నది. 'ఫిల్టర్ వాటర్ టాంక్' వుండుట మూలమున నీటి సౌకర్యము ఎల్లకాలములయందును వుండును.

నిపుణులైన ఆయుర్వేద పండితులచే ప్రథమ చికిత్సలు చేయబడుతూన్నవి. సంస్కృత విద్యా పీఠం అనుపేరుతో ఇరువది ఐదుమంది విద్యార్థులు, ఉచిత భోజన వసతులచే 'ఎంట్రన్స్' వరకు ఇరువురి ఉపాధ్యాయులచే విద్యాబోధన జరుగుచున్నది.



కొండపైకి వాహనములు వెళ్లుదారి

ఆలయమునకు చేరుకొనుటకు మూడు ముఖ్యమైన మార్గము లున్నవి. అందు కాలినడక మార్గము ముఖ్యమయినది. వేలాది ప్రజలు నిర్భయముగా అన్నివేళలయందు స్వామివారిని సేవించు కొనుటకు వచ్చుచుందురు.

ఆలయము కొండ పైభాగమున వుండుటవలన చక్కని ప్రకృతి రమణీయతకు ఉనికిపట్టయి విలసిల్లుచున్నది.

చల్లచల్లని పిల్లవాయువులు, మెలమెల్లన మేనును తాకుచుండ పచ్చపచ్చని పైరులు కనువిందుగ కానుపించుచుండగ ఏమా ఆనందము ? ఎలా వర్ణింపశక్యము!

ఈ క్షేత్రము చరిత్రాత్మకముగాను, వ్యావహారికముగానూ, ప్రసిద్ధి చెందినదియై 'రెండవ తిరుపతియా!' అన్న భావన కల్గు చుండును.

ఇట్టి మహాక్షేత్రము దర్శించి, స్వామిని సేవించి తరించు భాగ్యమే మహాభాగ్యము.

*

# జిల్లాల్లో

## పొందూరులో ముఖ్యమంత్రి ప్రసంగం

ముఖ్యమంత్రి శ్రీ పి. వి. నరసింహారావు, మే . న తేదీన పొందూరులో జరిగిన బహిరంగ సభలో ప్రసంగిస్తూ కొద్దిరోజుల క్రితం శ్రీకాకుళం జిల్లాలోనే భూమి పరిమితులను గూర్చి తాను ఒక ప్రకటన చేశాననీ, యిప్పుడు యీ మేరకు ఒక ఆర్డినెన్సు జారీ చేయడం జరిగిందనీ అన్నారు ఈ జిల్లా నుండే దాని అమలు ప్రారంభం, పురోభివృద్ధిగాంచగలదనే ఆశాభావం వెల్లడించారు.

మొద్దువలస నీటిపారుదల పథకం పరిశీలన జరుగుతున్నదని చెబుతూ త్వరలోనే దానిని మంజూరు చేయడం జరుగుతుందని ముఖ్యమంత్రి హామీయిచ్చారు

ఈ గ్రామంలో మేలిరకం ఖాదీ ఉత్పత్తి కావడం ఆంధ్రప్రదేశ్‌కు గర్వకారణమని చెబుతూ యీ పరిశ్రమ ఎదుర్కొంటున్న యిబ్బందులను గూర్చి ఖాదీ కమీషన్‌తో చర్చించానని ఆయన అన్నారు.

## మధిర పంచాయతీ సమితిలో అభివృద్ధి కార్యక్రమాల పరిశీలన

ఖమ్మంజిల్లా కలెక్టరు శ్రీ ఆర్. పార్థసారథి మే 3వ తేదీన యితర జిల్లా అధికారులతో కలిసి మధిర పంచాయతీ సమితిని సందర్శించారు. సమితిలో జరుగుతున్న అభివృద్ధి కార్యక్రమాలను గూర్చి స్వయంగా తెలుసు కోవడానికి యీ పర్యటన జరిపారు.

వైరాలో నిర్మాణంలో ఉన్న బెస్తల కాలనీని కలెక్టరు తనిఖీ చేశారు. త్వరలో నిర్మాణం పూర్తి కావాలని అసిస్టెంట్ ఇంజనీరును బ్లాకు అభివృద్ధి అధికారిని ఆయన కోరారు. ఖమ్మంలోని షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగల గృహ నిర్మాణ సంఘం ఇంటికి రు.1,800ల చొప్పున మంజూరు చేసిన మొత్తానికి తోడు మత్స్యపరిశ్రమ శాఖకూడా రు 10,000 లను మంజూరు చేసిందని కలెక్టరు తెల్పారు

పుణ్యపురం గ్రామంలో బావులను లోతు త్రవ్వడానికీ పుణ్యపురం గ్రామంనుండి సిరిపురం గ్రామం వరకు రోడ్డు నిర్మించడానికీ కరువు నివారణ నిధినుండి రు.10 000 లను కలెక్టరు మంజూరు చేశారు. ఇండ్ల నిర్మాణం నిమిత్తం రు.100ల చొప్పున 24 హరిజన కుటుంబాలకు ఆర్థిక సహాయం మంజూరు చేశారు సిరిపురంలో ప్రాథమిక పాఠశాల భవన నిర్మాణం నిమిత్తం రు.10,000 లను కూడా కలెక్టరు మంజూరు చేశారు.



ముఖ్య మంత్రి జూన్ 15వ తేదీన గుంటూరులో జరిగిన భూసంస్కరణల సభలో ప్రసంగించారు.

## పంచాయతీరాజ్ వ్యవస్థలో మార్పులు

పంచాయతీరాజ్ శాఖామంత్రి శ్రీ టి హయగ్రీవాచారి మే 25న నిజామాబాదు జిల్లా పరిషత్తు సభ్యుల సమావేశంలో ప్రసంగిస్తూ యిటీవలి కాలంలో పంచాయతీరాజ్ పద్ధతులపై అనేక విమర్శలు వినిపిస్తున్నాయనీ. దానివల్ల యీ వ్యవస్థ బలహీనమయ్యే అవకాశం ఉందనీ అన్నారు. పంచాయతీ సమితులు, పరిషత్తులు కొంత కాలంపాటు బాగానే పనిచేశాయి అయితే ఆ తర్వాత యే ఆశయ సిద్ధికై అవి ఏర్పాటు చేయబడినాయో వాటిని అవి పూర్తి చేయలేక పోతున్నాయి అని మంత్రి అన్నారు పంచాయతీరాజ్ వ్యవస్థలో అవసరమైనప్పుడల్లా మార్పులు చేర్పులు చేస్తూనే ఉన్నారు. అందువల్ల ఆశించిన ఫలితాలు సాధించడానికి వీలుగా పంచాయతీరాజ్ వ్యవస్థను సమూలంగా మార్చాలని ప్రభుత్వం భావిస్తున్నది.

అంతకుముందు జిల్లా కలెక్టరు శ్రీ ఎస్.కె. సురయా ప్రసంగిస్తూ కరువు నివారణ పథకాలు, క్రాష్ పథకాల క్రింద నిజామాబాదు జిల్లాలో జరిగిన అభివృద్ధి కృషిని గూర్చి వివరించారు.

## లెవీ సేకరణలో మిల్లర్లు సహకరించాలి మంత్రి విజ్ఞప్తి

పౌరసరఫరా శాఖామంత్రి శ్రీ చల్లా సుబ్బారాయుడు, పౌరసరఫరా కమీషనరు శ్రీ కె.బి. లాల్ ప్రభృతులు మే 2న నిజామాబాదు సందర్శించారు.

మంత్రి మిల్లర్ల సమావేశంలో ప్రసంగిస్తూ ఎటువంటి యిబ్బందులు లేకుండా చౌక దుకాణాలకు బియ్యం సరఫరా చేయడానికి లెవీ సేకరించడంలో మిల్లర్లు తమ సహకారాన్ని అందజేయాలని వారికి విజ్ఞప్తి చేశారు సేకరణ కార్యక్రమం క్రింద ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 3.6 లక్షల బియ్యాన్ని సేకరిస్తున్నదని ఆయన అన్నారు. 1972 జూన్ నుండి ఐదుమాసాలపాటు

స్థానిక అవసరాల నిమిత్తం నెలకు 2,600 క్వింటాళ్ల చొప్పున బియ్యం సరఫరా చేయడానికి నిజామాబాదు మిల్లర్ల సంఘం అంగీకరించింది.

## రేణిగుంటలో సామూహిక కుటుంబ నియంత్రణ శస్త్రచికిత్సా శిబిరం

చిత్తూరు జిల్లా కుటుంబ నియంత్రణ కేంద్రంవారు నిర్వహించిన శస్త్రచికిత్సాశిబిరంలో 295 కుటుంబ నియంత్రణ శస్త్రచికిత్సలను నిర్వహించారు.

ఇటీవల పత్రికా ప్రతినిధుల బృందం యీ శిబిరాన్ని సందర్శించింది. ప్రజల నుండి ముఖ్యంగా అల్పాదాయవర్గాల ప్రజల నుండి—మంచి ప్రోత్సాహం లభించినట్లు యీ బృందం గమనించింది. తక్కువ ఆదాయాలతో సతమతమవుతున్న తమకు కుటుంబ నియంత్రణ ఒక ఆశా కిరణంగా కనిపించిందని ట్యుబెక్టమీ శస్త్రచికిత్స పొందిన ఒక స్త్రీ తన అభిప్రాయాన్ని వ్యక్తంచేసింది.

జిల్లా వైద్య ఆరోగ్య శాఖాధికారి, డా॥ పి. కృష్ణమూర్తి పత్రికా ప్రతినిధులకు యీ శిబిరాన్ని చూపారు.

గత మూడు సంవత్సరాలుగా చిత్తూరు జిల్లాలో కుటుంబ నియంత్రణ కార్యక్రమం గణనీయంగా అమలు జరుగుతున్నది. ప్రభుత్వం నిర్దేశించిన లక్ష్యాలను మించి శస్త్రచికిత్సలు జరిగాయి.

## పంచాయతీరాజ్ పరిపాలన—ప్రజల పాత్ర

పంచాయతీరాజ్ శాఖామంత్రి శ్రీ టి. హయగ్రీవాచారి, మే 24న గూడూరులో పంచాయతీ సమితి సభ్యుల సమావేశంలో ప్రసంగిస్తూ పంచాయతీ రాజ్ పరిపాలన విజయవంతం కావడానికి అభివృద్ధి ప్రణాళికల అమలులో ప్రజలు హృదయపూర్వకంగా పాల్గొంటూ తమవంతు కృషిని నిర్వహించాల్సి ఉందని అన్నారు.

ఈ సందర్భంగా పార్లమెంటుసభ్యులు, శ్రీ ఎస్. జనార్ధన్ రెడ్డి ప్రసంగిస్తూ సాంఘిక సంక్షేమ హాస్టళ్ళు, విద్యాసంస్థల నిర్వహణ నిమిత్తం పంచాయతీరాజ్ పరిపాలనా పరిధి నుండి ఉపసంహరించాలని సూచించారు.

సమితి అధ్యక్షుడు శ్రీ గోపాలరెడ్డి ప్రసంగిస్తూ మంచినీటి, బావుల త్రవ్వకం పనులను చేపట్టడానికి చిన్నతరహా నీటిపారుదల రక్షిత మంచినీటి సరఫరా పథకాల క్రింద ప్రభుత్వం నిధులను సమకూర్చాలని విజ్ఞప్తి చేశారు.

అంతకుముందు మంత్రి పురిటిపాలెంలో రోడ్డు నిర్మాణానికి ప్రారంభోత్సవం చేశారు. రు. 37,500 ల ఖర్చుతో యీ పని చేపట్టబడింది.

మర్రిపల్లిమాడుగులలో కాజ్‌వేకు, విడూరులో రోడ్డు నిర్మాణానికి మంత్రి ప్రారంభోత్సవం చేశారు. గ్రామీణ ఉపాధి కల్పన క్రాష్ పథకం క్రింద యీ పనులను ప్రారంభించారు.



గుంటూరులో బహిరంగ సభలో జూన్ 15వ తేదీన ముఖ్య మంత్రి ప్రసంగం



ముఖ్య మంత్రి నెల్లూరు జిల్లాకలెక్టరు శ్రీ ఎం. ఎస్. వీర రాఘవన్‌కు, దేశరక్షణ నిధి ఎక్కువగా వసూలు చేసినందుకు షీల్డు బహూకరించారు



సాంఘిక సంక్షేమ మంత్రి శ్రీ ఎం. వి. కృష్ణారావు కరీంనగర్ జిల్లా మెట్‌పల్లిలో ఇందిరా నగర్ హరిజన కాలనీకి ప్రారంభోత్సవంచేశారు (మే 23).



విద్యుచ్ఛక్తి, మహిళా సంక్షేమ శాఖ మంత్రిణి శ్రీమతి బి. జయప్రద గుంటూరులోని, కొరిటె పాడులో అగ్నిప్రమాద బాధితులకు వస్త్రాలు పంపిణీ చేశారు (మే 25).



మే నెలలో గుంటూరులోజరిగిన అఖిల భారత పారిశ్రామిక ప్రదర్శనంలో సమాచార శాఖ స్టాలు



రాష్ట్ర మంత్రులు శ్రీయుతులు ఎం. మాణిక్‌రావు ఎ. మదన మోహన్ గార్లు ఖమ్మంలో జూన్ 11న ఎన్. జి. ఓ. కాలనీ, కమ్యూనిటీ హాలునకు శంఖుస్థాపనలు చేశారు.

కోటలో మంత్రి రు 30,000 ఖర్చుతో నిర్మించబడే పంచాయతీ సమితి కార్యాలయం భవన నిర్మాణానికి ప్రారంభోత్సవం చేశారు. అగ్రిమ పంచాయతీ అధ్యక్షులు శ్రీ ఎ శ్యామసుందర రెడ్డి రు.20,000 లు ఖరీదుచేసే మూడు ఎకరాల భూమిని భవన నిర్మాణానికి విరాళంగా యిచ్చారు.

వాకాడులో మంత్రి పంచాయతీ కార్యాలయ భవనానికి ప్రారంభోత్సవం చేశారు.

హల్లపుడి, దుగ్గరాజపట్నం గ్రామాలలో మంత్రి భూమి లేని పేద గిరిజనులకు యిండ్ల స్థలాల పట్టాలను పంపిణీచేశారు రెడ్డిపాలెం గ్రామంలో 64 మంది భూమిలేని పేదలకు కూడ పట్టాలు పంపిణీ చేశారు.

## కుటుంబ నియంత్రణ శాఖ సిబ్బంది గృహాలకు ప్రారంభోత్సవం

కడప జిల్లా కలక్టరు శ్రీ ఎస్. వి. గిరి. ఇటీవల ప్రొద్దుటూరు సమితిలోని కల్లూరులో కుటుంబనియంత్రణ శాఖ సిబ్బంది గృహాలకు ప్రారంభోత్సవం చేశారు ఈ సందర్భంగా జరిగిన బహిరంగ సభలో కలెక్టరు ప్రసంగిస్తూ కంట్రాక్టరూ యీ పనిని చేపట్టడానికి ముందుకు రాని కారణంగా యీ యిండ్ల నిర్మాణం కొంత ఆలస్యమైందని అన్నారు. ఉన్నత పాఠశాలను ఏర్పాటు చేయాలనే కోరికను గూర్చి ప్రస్తావిస్తూ జిల్లా పరిషత్తు నిధికి అవసరమైన విరాళాలను అందజేయాలని ప్రజలకు కలక్టరు సూచించారు.

ప్రొద్దుటూరు పంచాయతీ సమితి అధ్యక్షుడు శ్రీ ఆర్. చంద్ర ఓబుల్ రెడ్డి ప్రసంగిస్తూ కలక్టరు నిర్వహించిన కృషిని ప్రశంసించారు.

## మహబూబునగర్‌లో మంత్రి గ్రంథాలయం సందర్శన

యాంత్రిక వ్యవహారాల శాఖ మంత్రి డా పి హెచ్. దేవానందరావు మే 9వ తేదీన మహబూబ్‌నగర్ జిల్లా కేంద్ర గ్రంథాలయాన్ని సందర్శించారు.

ఈ సందర్భంగా మంత్రి ప్రసంగిస్తూ గ్రంథాలయాల గ్రాంట్లను ఎక్కువ చేసే విషయాన్ని గూర్చి పరిశీలిస్తామని హామీ యిచ్చారు.

## కోర్లట్ల, బొమ్మకల్లు గ్రామాలలో హరిజన కాలనీలకు ప్రారంభోత్సవం

సాంఘిక సంక్షేమ శాఖామంత్రి, శ్రీ ఎం వి కృష్ణారావు మే 23న కోర్లట్లలో 59 గృహాలున్న హరిజన కాలనీకి ప్రారంభోత్సవం చేశారు ఈ కాలనీని "సంజీవయ్య నగర్" పేరుతో వ్యవహరిస్తున్నారు. ఈ సందర్భంగా జరిగిన సభలో మంత్రి ప్రసంగిస్తూ బీదప్రజల, వెనుకబడిన వర్గాల అభ్యున్నతికి నిరంతరం


1


4


2

# నగరంలో వార్తలు

1. హైదరాబాద్ ఇకో" అనే కొత్త ఆంగ్ల దిన పత్రికకు ముఖ్య మంత్రి మే 25వ తేదీన ప్రారంభోత్సవం చేశారు.

2. హైదరాబాదు పౌర సంక్షేమ సంఘం మే 22వ తేదీన రవాణా మంత్రి శ్రీ కె. ప్రభాకర రెడ్డిని అభినందిస్తూ సభ జరిపారు.

3. హైదరాబాదులోని బషీర్ బాగ్‌లో మే 4వ తేదీన ఆర్థిక మంత్రి శ్రీ ఎ. భగవంత రావు "హోటల్ మహారాజా"కు ప్రారంభోత్సవం చేశారు.

4. భారత ఆహార సంస్థ తాలూకు విక్రయ కేంద్రానికి ముఖ్య మంత్రి మే 25వ తేదీన హైదరాబాదులో ప్రారంభోత్సవం చేశారు.

5. మార్కెటింగ్ శాఖ మంత్రి శ్రీ డి. మునుస్వామి, పురావస్తు శాఖ మంత్రి శ్రీ ఎం. ఆర్. శ్యామరావు గార్లు సంజీవయ్య గారి చితా భస్మాన్ని మే 21వ తేదీన సంగంలో కలిపారు.


3


5



(i)



(iii)

## నగరంలో వార్తలు

(i) క్రీడల శాఖా మంత్రి శ్రీ ఎం. ఆర్. శ్యామ్‌రావు రైల్వే బాస్కెట్‌బాల్ క్రీడోత్సవానికి మే 6వ తేదీన ప్రధాన అతిథిగా హాజరయ్యారు.

(ii) మే 29వ తేదీన బంగ్లా దేశ్ ప్రభుత్వ స్థానిక పరిపాలన మంత్రికి బేగంపేట విమానాశ్రయం వద్ద స్వాగతం.

(iii) మే 29వ తేదీన బంగ్లాదేశ్ ప్రభుత్వ స్థానిక పరిపాలన మంత్రికి బంగ్లాదేశ్ స్నేహ సంఘంవారు ఆతిథ్య మిచ్చారు.

(iv) మే 7వ తేదీన కేంద్ర సాహిత్య అకాడమీ బహుమతి గ్రహీత శ్రీ తాపీ ధర్మారావు గారికి విద్యా శాఖ మంత్రి శ్రీ భాట్టం శ్రీరామమూర్తి బహుమతి ప్రదానం చేశారు.

(v) సాంకేతిక విద్యా శాఖా మంత్రి శ్రీ ఎ. మదన్‌మోహన్ మే 21వ తేదీన రవీంద్ర భారతిలో "భారత దర్శన్" నృత్య నాటిక సందర్భంగా ప్రసంగించారు.



(iv)

(v)





(ii)

కృషిచేసిన కీ. శే. శ్రీ సంజీవయ్య పేరుతో యీ కాలనీ వ్యవహరించ బడడం సముచితంగా ఉందని అన్నారు. ఈ కాలనీలో నివసించే ప్రజలు తమ స్థితిగతులను మెరుగు పర్చుకోవానికి ఆయనను ఆదర్శంగా తీసుకోవాలని అక్కడి నివాసితులకు మంత్రి విజ్ఞప్తి చేశారు. హరిజనుల క్షేమానికి వారి జీవన పరిస్థితులను మెరుగు పర్చడానికి యిండ్లు నిర్మించి యివ్వబడుతున్నవని ఆయన అన్నారు.

రు. 1800ల రుణం మొత్తం సరిపోదనే విషయాన్ని గూర్చి మంత్రి ప్రస్తావిస్తూ రాష్ట్ర ఆర్థిక పరిస్థితుల పరిమితుల దృష్ట్యా యీ మొత్తాన్ని యింకా ఎక్కువచేసే స్థితి లేదని అన్నారు.

సభకు అధ్యక్షత వహించిన కరీంనగర్ జిల్లా కలక్టరు ఎస్. వి. సుబ్రమణ్యం ప్రసంగిస్తూ ఆర్థిక సహాయం పథకం క్రింద నిర్ణీతకాలంలో యిండ్లు నిర్మించుకున్న హరిజనులకు 20 పాడి పశువులను పంపిణీ చేశారని అన్నారు. ఈ కాలనీ వాసులు కూడా నిర్ణీత కాలంలో యిండ్లు నిర్మించుకుని పాడిపశువులను పొంద వచ్చునని సలహా యిచ్చారు. గ్రామ పంచాయతీ యీ కాలనీలో మంచినీటి కొళాయి ఏర్పాటు చేసింది. అందువల్ల యిక్కడ మంచినీటి సమస్యలేదని కలెక్టరు అన్నారు. ఈ కాలనీకి త్వరలో విద్యుచ్ఛక్తి సరఫరా చేయబడుతుంది. జిల్లాలో యీ పథకాన్ని విజయవంతంగా అమలు జరుపుతున్న దృష్ట్యా యీ జిల్లాలో అదనంగా మరో 500 గృహాలను మంజూరు చేయాలని మంత్రికి ఆయన విజ్ఞప్తి చేశారు.

ఆదేరోజు సాయంత్రం మంత్రి 38 గృహాలుగల 'జగజీవన్ నగర్' హరిజన కాలనీకి ప్రారంభోత్సవం చేశారు

ఈ సందర్భంగా మంత్రి ప్రసంగిస్తూ ఎల్ ఐ సి. నుండి ప్రభుత్వం స్వీకరించిన రు. 10 కోట్ల రుణంనుండి హరిజన కాలనీల నిర్మాణానికి ఖర్చుచేయడం జరుగుతున్నదని అన్నారు. బడుగువర్గాల అభ్యున్నతికి ప్రభుత్వం అనేక కార్యక్రమాలను అమలు జరుపుతున్నదని మంత్రి వెల్లడించారు.

## నెల్లూరు ప్రసూతి ఆసుపత్రిలో కుటుంబ నియంత్రణ శస్త్రచికిత్స వార్డుకు ప్రారంభోత్సవం

రాష్ట్ర ఆరోగ్య శాఖామంత్రి, శ్రీ ఎం. ఇబ్రహిం అలీ అన్సారి, మే 22వ తేదీన నెల్లూరులోని ప్రసూతి ఆసుపత్రిలో 20 పడకల కుటుంబ నియంత్రణ శస్త్రచికిత్స వార్డు భవనానికి ప్రారంభోత్సవం చేశారు. రు. 1.11 కోట్ల ఖర్చుతో యీ భవనం నిర్మించ బడుతున్నది.

ఈ సందర్భంగా మంత్రి ప్రసంగిస్తూ కుటుంబ నియంత్రణ పద్ధతులను అనుసరించాల్సిన అవసరాన్ని గూర్చి నొక్కి చెప్పారు. ట్యుబెక్టమీ శస్త్రచికిత్స విషయంలో దేశంలో యితర రాష్ట్రాలకన్నా ఆంధ్రప్రదేశ్ ప్రథమస్థానం ఆక్రమించిందని అన్నారు ప్రజలు తమ స్వప్రయోజనానికీ, దేశ ప్రయోజనానికీ కుటుంబనియంత్రణ పద్ధతులను అనుసరించాలని మంత్రి విజ్ఞప్తి చేశారు.

## పోచంపాడు ప్రాజెక్టులో మునిగిపోయే గ్రామాల ప్రజల పునరావాసానికి చర్చలు

భారీతరహా నీటిపారుదల శాఖామంత్రి శ్రీ పి. నరసారెడ్డి, చేనేత, సహకార చక్కెర ఫ్యాక్టరీల శాఖామంత్రి శ్రీ జి. రాజారాం ఇటీవల నిజామాబాదు జిల్లా, ఆర్మూరు తాలూకాలోని గాడిపల్లి గ్రామాన్ని దర్శించారు. ఇక్కడ పోచంపాడు ప్రాజెక్టువల్ల మునిగిపోయే గ్రామాల ప్రజలు మంత్రులకు తమ పునరావాస సౌకర్యాలను గురించి అనేక విజ్ఞప్తులు చేశారు.

ప్రాజెక్టులో గ్రామాలు మునిగిపోనున్నవి కనుక ప్రభుత్వం వారు ఈ గ్రామాల ప్రజలకు కల్పించే పునరావాస సౌకర్యాలను వినియోగించుకోవాలని, వారికి ప్రభుత్వం యథాశక్తి సహాయం చేయగలదని మంత్రులు చెప్పారు.

గాడేపల్లి గ్రామ పంచాయతీ ప్రజలు మంత్రులకు ఘనంగా స్వాగతమిచ్చారు. మంత్రులు అంతకుముందు పోచంపాడు ప్రాజెక్టు స్పెషల్ కలెక్టరు శ్రీ ఖాలిద్ అన్సారీతోను, సంబంధించిన పునరావాస డిప్యూటీ కలెక్టరుతోను పునరావాసానికి సంబంధించిన పనులను సమీక్షచేశారు.



కాకినాడలో మే 5వ తేదీన పరిశ్రమల శాఖ మంత్రి శ్రీ జె. వెంగళ రావు బంగ్లా మృత వీరుల స్మృతి చిహ్నాన్ని ఆవిష్కరించారు.

## ఖమ్మం జిల్లాలో గ్రామీణ విద్యుత్ సరఫరా కార్యక్రమం

ఖమ్మం జిల్లాలోవున్న మొత్తం 1239 పట్టణాలు, గ్రామాలలో 268 పట్టణాలు, గ్రామాలు; 58 కుగ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరాచేయడం జరిగింది. 1972 మార్చి 31వ తేదీ నాటికి 21.63 శాతం గ్రామాలకు, పట్టణాలకు విద్యుచ్ఛక్తి సరఫరా అయిందని లెక్కపెట్టబడింది. ఈ 268 గ్రామాల్లో భద్రాచలం, నూగూరు, బూర్గంపాడు, కొత్తగూడెం, యెల్లందు తాలూకాల్లో 102 గిరిజన గ్రామాలు కూడా వున్నాయి.

ఖమ్మం జిల్లాలో 1971–72 సంవత్సరంలో గ్రామీణ ప్రాంతాల విద్యుదీకరణ కార్యక్రమం క్రింద మొత్తం రూ. 37.52 లక్షలు ఖర్చుపెట్టడం జరిగింది. ఈ కాలంలో వ్యవసాయం, పరిశ్రమలు గృహోపయోగ నిమిత్తం మొత్తం 2679 సర్వీసు కనెక్షనులు ఇవ్వబడినాయి. దీనితో ఇప్పుడు జిల్లాలో మొత్తం 16687 సర్వీసు కనెక్షనులు వున్నాయి.



మే 29వ తేదీన ప్రకాశం జిల్లా గంగ వరంలో జిల్లా వెటర్నరీ ఆఫీసరు శ్రీ వి. కమలాకరరావు పశువుల ప్రథమ చికిత్సా కేంద్రం ప్రారంభించారు.

## సన్నకారు రైతులకు నాగటి ఎద్దుల పంపిణీ

కడపజిల్లా కలక్టరు, జిల్లాసన్నకారు రైతుల అభివృద్ధి సంస్థ అధ్యక్షుడు శ్రీ ఎన్. వి. గిరి, మే 3 వ తేదీన కడప సమితిలో చింతకొమ్మదిన్నె గ్రామంలో ఆరుగురు హరిజన సన్నకారు రైతులకు ఒకజత చొప్పున ఎద్దులను పంపిణీచేశారు. ఈ సందర్భంగా జరిగిన బహిరంగసభలో కలక్టరు ప్రసంగిస్తూ గత సంవత్సరం యీ గ్రామంలో వాణిజ్యపంటలు సేద్యం చేయడానికి సన్నకారు రైతులకు రు. 70,000 ల మేరకు పంట రుణాలను మంజూరుచేయడం జరిగిందని అన్నారు. ఈ సంవత్సరం కూడా పంటల రుణాలను ఇవ్వడానికి వీలుగా లోగడ రుణాలు తీసుకున్న రైతులు తమ వాయిదాలను సరిగా చెల్లించాలని రైతులకు ఆయన విజ్ఞప్తి చేశారు.

అంతకు ముందు కలక్టరు ఆ గ్రామానికి రు. 1000 లు విలువచేసే విద్యుచ్ఛక్తి స్ప్రేయర్లను బహూకరించారు.

ఉత్పత్తిని అధికం చేయడానికి అనుసరించాల్సిన వివిధ విధానాలను వివరిస్తూ యీ సంస్థ ప్రచురించిన పుస్తకాన్ని కలక్టరు ఆవిష్కరించారు.

## సంక్షేమ పథకాల అవకాశాలను వినియోగించుకోవాలని బలహీనవర్గాలకు సలహా

రవాణా శాఖా మంత్రి శ్రీ కె. ప్రభాకరరెడ్డి మే 3 వ తేదీన హయాత్ నగర్ పంచాయతీ సమితిలోని కుంటలూరులో జరిగిన బ్రహ్మాండమైన బహిరంగ సభలో ప్రసంగిస్తూ ప్రధానమంత్రి చేపట్టిన అభ్యుదయకర విధానాలను బలపర్చవల్సిందిగా ప్రజలకు విజ్ఞప్తి చేశారు. పేదల జీవన పరిస్థితులను మెరుగు పర్చడానికి ప్రభుత్వం అమలు జరుపుతున్న సంక్షేమ పథకాలనుండి ప్రయోజనం పొందాలని హరిజనులకు యితర బలహీనవర్గాల ప్రజలకు మంత్రి సలహాయిచ్చారు.

అభివృద్ధి కార్యక్రమాలను గూర్చి మంత్రి ప్రస్తావిస్తూ సంక్షేమ పథకాలను ఎక్కువగా అమలు జరపడానికి నిధులను అధికంగా కేటాయించడానికి వీలుగా నాగార్జునసాగర్, పోచంపాడు ప్రాజెక్టు వంటి భారీప్రాజెక్టులపై పెట్టుబడులను తగ్గించాలని అన్నారు.

సభకు అధ్యక్షత వహించిన జిల్లా పరిషత్తు అధ్యక్షుడు శ్రీ భోజిరెడ్డి ప్రసంగిస్తూ సంక్షేమ పథకాలు, అభివృద్ధి పథకాలపై జాగ్రత్తగా ఖర్చుచేయాలని అన్నారు. జిల్లాలో బావులను లోతు త్రవ్వే కార్యక్రమాలకు ఎక్కువనిధులను కేటాయిస్తామని ఆయన హామీయిచ్చారు.

## మంగళంపేటలో పాఠశాల భవనానికి ప్రారంభోత్సవం

చిన్నతరహా నీటిపారుదల శాఖామంత్రి శ్రీ కె. గోపాల్ నాయుడు, మే 4 వ తేదీన చిత్తూరు జిల్లా పులిచర్ల సమితిలోని

మంగళంపేట గ్రామంలో పాఠశాల భవనానికి ప్రారంభోత్సవం చేశారు. రు. 7500 ల ఖర్చుతో యీ భవనం నిర్మించబడింది. ఈ మొత్తంలో గ్రామ పంచాయతీ, ప్రజలు రు. 1,313 విరాళంగా యిచ్చారు.

ఈ సందర్భంగా జరిగిన సభలో మంత్రి ప్రసంగిస్తూ పరిశీలన అవసరమైన సాంకేతిక మంజూరీలు లభించిన తర్వాతనే కొత్త నీటిపారుదల పథకాలను చేపట్టడం జరుగుతుందని అన్నారు. ఈ సంవత్సరం హరిజనులకు ఎక్కువ యిండ్లను యివ్వడం జరుగుతుందని మంత్రి అన్నారు

శాసనసభ్యులు శ్రీ సయీదుల్లా. బేగ్ ప్రసంగిస్తూ కరువు పరిస్థితుల దృష్ట్యా మంచినీటి సరఫరా పథకాల అమలుకు ఎక్కువ నిధులను కేటాయించాలని ప్రభుత్వానికి విజ్ఞప్తిచేశారు. గ్రామాలలో రుణాల సేకరణను వాయిదావేయాలని కూడా ఆయన విజ్ఞప్తి చేశారు.

## పాఠశాల భవనానికి ప్రారంభోత్సవం

సాంఘిక సంక్షేమ శాఖామంత్రి శ్రీ ఎం.వి కృష్ణారావు, యిటీవల నెల్లూరు జిల్లా ఇందుకూరిపేట పంచాయతీ సమితిలోని మైపాడు గ్రామానికి చెందిన పశ్చిమ పటపురా పాలెంలో ప్రాథమిక పాఠశాల భవనానికి ప్రారంభోత్సవం జరిపారు ఈ భవన నిర్మాణానికి అయిన రూ. 11,500ల ఖర్చుతో మూడింట నాలుగు వంతులు పంచాయతీ సమితి భరించినది. మిగిలిన భాగాన్ని ప్రజలు శ్రమదానంతో సమకూర్చారు. ఈ సందర్భంలో ఏర్పాటైన సభకు శాసనసభ్యులు శ్రీ పి. రామచంద్రారెడ్డి అధ్యక్షత వహించారు.

మంత్రి శ్రీ ఎం వి. కృష్ణారావు ప్రసంగిస్తూ బెస్త ప్రజల కొరకై అభివృద్ధి కార్యక్రమాలను మంజూరు చేయడం ఎంతో అవసరమని చెప్పారు రాష్ట్రంలోని హరిజనులకు నివేశన స్థలాలు మున్నగువాటిని పంచిపెట్టడానికి ప్రభుత్వం అత్యంత ప్రాధాన్యత యిస్తున్నదని అన్నారు. ప్రభుత్వం చేపట్టిన వివిధ పథకాల నుంచి బలహీన వర్గాలవారు లాభం పొందాలని ప్రభుత్వం అమలు జరుపుతున్న కార్యక్రమాలను వారు దుర్వినియోగ పర్చకుండా జాగ్రత్తపడాలని ఆయన వినతిచేశారు. సోమరితనం, అనుమాన తత్వం వదిలిపెట్టి చిత్తశుద్ధితో కర్తవ్యదీక్షతో, నిజాయితీతో కృషిచేస్తూ ప్రగతిపథంతో పురోగమించాలని ఆయన ఉద్బోధించారు.

ఇందుకూరిపేట సమితి అధ్యక్షుడు శ్రీ ఎ. భక్తవత్సలరెడ్డి ప్రసంగిస్తూ సమాచార శాఖకు చెందిన బ్లాకు అసిస్టెంటు పబ్లిక్ రిలేషన్సు ఆఫీసర్లను సమితి యాజమాన్యానికి బదిలీచేయాలనీ. బ్లాకు స్థాయిలో సేకరణ, హాస్టలు నిర్వహణ వంటి సాంఘిక సంక్షేమ కార్యకలాపాలను వారికి అప్పగించాలని. సమితులలో సాంఘిక సంక్షేమ పథకాల సత్వరంగా అమలు పరచడానికి వీలుగా ఈ కార్యకలాపాలన్నీ జిల్లా సంక్షేమ శాఖాధికారి పర్యవేక్షణ క్రిందికి తేవాలని సూచన చేశారు.

మైపాడు గ్రామ సర్పంచ్ తిక్కవరపు బలరామిరెడ్డి వందన సమర్పణ చేశారు

# స్వీయ చరిత్ర ఆధారంగా - బుజ్జాయి

ప్రకాశంది ఏమీ తప్పు లేదని గ్రహించి కలెక్టర్ గారు మళ్ళీ అతన్ని స్కూల్లో ప్రవేశ పెట్టారు. మరి కొన్ని రోజులు గడిచాయి



అలాగే ఒక పక్క అల్లరి పిల్లవాడుగా పేరు తెచ్చు కున్నాడు. చదువులో మాత్రం ఏ లోటూ ఉండేది కాదు! ఆ రోజుల్లోనే నరసింహారావు అని బి.ఏ. చదువుతున్న ఒక విద్యార్థితో చిన్న ప్రకాశం స్నేహం చేశాడు—




అలా ఆయనతో తిరుగుతూ, ఎన్నో విషయాలు ప్రకాశం తెలుసుకున్నాడు.

ఆ రోజుల్లో వెంకటగిరి రాజాగారి ఏనుగులు సువర్ణముఖి దగ్గరగా ఒక తోటలో ఉండేవి—




ఒక రోజు ఏనుగులు తోటలో తిరుగుతూ ఉండగా, చెట్టు మీద దాక్కున్న ప్రకాశం, కిందనే నడుస్తున్న ఒక ఏనుగు మీదకు దూకాడు—




ఇంతలో మావటి వాడు చూశాడు—







మావటి వాడు మెత్తబడ్డాడు. పిల్లల దగ్గర డబ్బులు తీసుకుని ఏనుగు మీద షికారు చేయించేవాడు. ముఠానాయకుడు - పేలులాంటి ప్రకాశం చదువు సరదాగా గడిచింది!



